లందు నిత్యము. ''వచ్చు-రప్పించు-రావించు. నొచ్చు-నొంచు-నొప్పించు. చొచ్చు-చొనుపు-చొప్పించు" ఇత్యాదులందు విశేష రూపాభావ పక్షమున నిత్యమె

ముజ్జీత్తులు ముత్తు నాఁబడు ౯౦ (బా-క్రి-౮౬; వ్యా-సం-౩౩౧ I విష).

ముడుజ్జులును, 'జి' ఇద్వర్ణముగాఁ గలవియు 'ముత్తు' అను సంజ్ఞ గల వగును.

## ముత్పరకత్వమున 'ప-వ'

ఆగమాన్య చకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరంబగునపుడు 'ప-వ' లగు ౯౧ (బా-క్రి-౮౮).

ఆగమ : పచింపఁడు-పచింపక-పచింపని-పచింపమి-పచింపకుము-పచింపుము-పచింపుఁడు-పచింపన్-పచింపఁగల-పచింపఁబడు-పచింపకుఁడు. అచ్చిక ధాతువులందును నిట్లె ! అడచు-అడపఁడు-అడఁపక-అడఁపని-అడఁపమి-అడఁపుము-అడఁపుఁడు-అడఁపన్ మొ. అన్య చకార-అవయవిక : పిలువఁడు-పిలువక-పిలువని-పిలువమి-పిలువుము-పిలువుఁడు-పిలువకుము - పిలువకుఁడు-పిలువన్-పిలువఁగల-పిలువఁబడు మొ. అద్విరుక్తము లనుటచేత "శా...రాజు మెచ్చం గేళీగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ'' (భీష్మ-౨వ ఆ-౩౦౪) అను రీతిని 'ప' త్వము లేదు. ఇట్లె : గ్రుచ్చు-గ్రుచ్చన్; పుఱచ్చు-పుఱచ్చన్ ; వ్రాక్రుచ్చు-వ్రాక్రుచ్చన్ మొ. "శ-ర; సూ-రా-ని'' కారులు ''గ్రువ్వన్-పుఱవ్వన్-వ్రాక్రువ్వన్"అను రీతిని వత్వమును నిరాధారముగ వాడిరి. అట్టి వత్వమును నిర్వహించు ప్రయోగ మొక్కటేని కానరాదు. ''తిగుచు-తివుచు-తివువన్-తివ్వన్-తివన్'' అనుచో ద్విరుక్త చకారమునకు వచ్చిన 'వ' త్వము కాదు. ''నొవ్వఁ బల్కెదు సభలోనఁ జివ్వకొల్ల'' (ఉద్యో-౪వ ఆ-౨౩౮) అను చోటి 'నొవ్వన్' అనెడి 'వ' త్వము ద్విరుక్త 'చ' కారమునకు వచ్చినది కాదు నొచ్చునకు 'నోవు' అనియే ముత్పరకత్వమున నగును (చూ-క్రియా-౯౮వసూ.) ఇట్లు 'నోవన్' అని యేర్పడినపిదప 'వ' కార ద్విత్వమయ్యెను (చూ-అచ్చి-౩౬వ సూ)

౧వ విష : కవిత్రయాదీతర కవి ప్రయోగంబుల మం గొన్నియెడల "మ" జ్యంతాదులు పరంబు లగునపుడు 'వ' త్వము విభాషనగు కం ఊహించ నొక నాల్గు గడియల సంచారము (కళా-౩; ప్రౌఢ-క్రియా-౧౬వ సూ). చం తీర్చుము వెసఁ జొమ్ము నమ్ము మనుమన్ (కళా-౬వ ఆ-; ప్రౌఢ-క్రియా-౧౬వ సూ).

## ఇవ్వన్-ఒలువన్ మొ. వ్యావహారికములు

౨వ విష : 'విడుచు-విడునట్లుచేయు' అను ప్రేరణార్థమున 'విడుపన్' అనవలెను "విడుచు-త్యజించు" అనుచో 'విడువన్' అని యర్వాచీనముగా నేర్పడెను. ఒలుచు-ఒలుపన్ సాధువు 'ఒలువన్' సరికాదు (ఒలియు, ప్రేరణ-ఒలుచు). విఱుచు-విఱుపన్ - సాధువు; 'విఱుపన్' వ్యావహారిక రూపము. "ఇచ్చు-ఈయన్-ఇయ్యన్-ఈన్" సాధురూపములు. 'ఇవ్వన్' వ్యావహారిక రూపము. 'ఎగుచు-ఎగుపన్' సాధురూపము. 'ఎగువన్' వ్యావహారిక రూపము. తాలుధాతు ప్రేరణము తాల్పన్ (తాల్పఁగ, సభా-౧వ ఆ-౭౫). వ్యావహారిక వాసన చే "ఇవ్వన్-ఒలువన్-విడవన్-విఱువన్-ఎగువన్" అను రూపములు హితముగా వినఁబడును కాని యట్టిచోటి 'వ' త్వమునకు మహాకవి ప్రయోగ ప్రామాణ్యము లేదు.

ఖండ బిందువుమీఁది సిద్ధ 'చ' కారంబునకు ముత్తు పరంబగు నపుడు 'ప' కారంబు ప్రాయికంబుగా నగు ౯౨ (బా-క్రి-౮౯వ సూ, వ్యా-సం ౩౩౧ III విష).

తలఁపక-తేఁపక (తేఁను-ధా- ఉద్గారించు). సైఁపక(సహింపక). తోఁపక. 'ఏఁచు'నకు వైభాషికంబు : ఏఁపక-ఏఁచక. 'నోఁచు'నకుఁ గలుగదు-నోఁచక. ఏఁచునకు విభాష . చం...ఏఁ పనగునె యైన నీదయిన పంపెదఁ గైకొని (విరా-౨వ ఆ-౨౬౩ ; చూ-వ్యా-సం-౧౬౨౨వ పుట) శా కం, జాత వ్రాతను మాటుచేర నవి యేఁచన్ సాగె (వసు-౩వ ఆ-౧౦౧) వెనుకటి క్రియ-౯౧వ సూ. చొప్పున వకారము రానేరదు. ప్రకృత సూత్రము 'ప'త్వము ప్రాయికముగా విధించుచున్నది.

# గర్జింపుచున్-చేరుపుచున్-చుదు-తు

కవిత్రయాదీతర ప్రయోగములందు వర్తమానార్థక 'చు' వర్ణక పర కత్వమునందును నాగమ 'చ' కారమునకు 'ప' త్వము విభాషగ నగును. ౯౩ (ప్రౌఢ-క్రి-౧౭ ; వ్యా-సం-౧౬౧౨ ౧౬౧౩ పుటలు ౩౩౦ వ విష).

చం. కపటపు...మోవిఁ జే రుపుచును...(కళా-౭వ-ఆ-౧౬౨వ ప). ఉ. కంపిత...గ ర్జింపుచునున్న...(జై-౨వ ఆ-౪౬).* ఇట్టివి ప్రాచీనకవి సమ్మతములు కావు ఉ ఇంచుక ..దుః ఖింపుచు ..(అశ్వ-౪వ ఆ-౭౩).

తద్ధర్మాద్యర్థకము, నుభయ ప్రార్థనాద్యర్థకము నగు 'దు' క్కుతోఁ గూడ నాగమ, తద్భిన్న 'చు' వర్ణములు రెండును 'తు' వర్ణముగా మాఱును.

ఇట్టి యెడల ద్విరుక్త 'చు' వర్ణంబు ద్విత్వ 'తు' వర్ణం బగును. కవిత్రయాదీతర ప్రయోగములందు "చుదు" అను దానితో పాటుగ 'యుదు' అనునదియు వైకల్పికముగా 'తు' వర్ణంబును, బూర్ణము మీఁది 'చుదు' వైకల్పికముగా 'పుదు' అనునదియు నగును ౯౪ (బా-కి-౬౦-౧౦౮ ; వ్యా-సం-౩౩౨ I విష).

ద్వివిధ 'చుదు' లును 'తు' అగుటకు : రక్షించు+దు+రు-రక్షింతురు. గెలుచు+దు+రు-గెలుతురు. ఉభయప్రార్థన : రక్షించు+దు+అ+ము-రక్షింతము. గెలుచు+దు+అ+ము-గెలుతము. కం. నివేదింతుమ తల్లికి ... (ఆది-౬వ-౨౪౦). పతయంగ వలలొ (అర-౨వ ఆ-౩౫౧). ద్విత్వ : కం. వోయి మనము ప త్త మెల్లి...భీష్మ ౨వ ఆ-౨౫౨). నన్నయ :

---

* ఇట్టి యర్వాచీన కవి ప్రయోగమును జూచి కావలయు నహోబిలపతి నన్నయ చింతామణి చే నిట్టి 'ప'త్వరూపమును సాధించి తన కవి శిరోభూషణమున "నుతింపుచున్నాఁడు-పోషింపుచున్నాఁడు" అని ప్రామాదికముగా నుదాహరించెను. దీనిని బట్టి ముద్రణ సంస్కర్తలు ప్రాచీన గ్రంథములందును నిట్టి ప్రయోగములను ప్రక్షిప్తమునను జేయుచున్నారు.

ఏమి సే యుదు సుతులార (ఆది ౧వ ఆ ३०४) యుదు-తు ... జేతువో (క ఓక-३వ ఆ ३३) కం. చె తురె యకట (దశా-३४३వ పు) నన్నయయే కాక తిక్కనాదులును 'చేతురు' మున్నగు రీతిని 'తు' వర్ణమును బ్రయోగించి రనుట పొరపాటు. అట్టి పాఠములు ప్రక్షిప్తములు (చూ-వ్యా-సం-౧౬-౨౮-౧౬-౨౯ పుటలు). 'ంచుదు-ంపుదు' ప్రయోగము: కం. తుద బహువచనమునకు ౦। పుచురును వింతురును నయ్యె బుధమి యెడల నిం చుదురును గలుగు .. (కావ్యాలం-౯వ ఉల్లా-౧౬౦). 'పూజింపుదుము' (ఆది-౨వ ఆ ౨౫౬) అని నన్నయ ప్రయోగించె ననుట కల్ల. అచట "పూజింతుము రుద్రునిం దనుచు వెడ్క" అనియే నన్నయ ప్రయోగించిన పాఠము అర్వాచీను లట్టివానిని బ్రయోగించిరి: గీ వచింపు। దురు వరుస మూడటంచు నందుల నథర్మ...(వరాహ-౭వ-ఆ-౧౧౦ బాలక-४३-२४ పుటలు).

౧వ వివ: కావింపుట, కోపింపుట మున్నగునవి కేవలము నపశబ్దములు. తిమ్మ కవ్యాదు లిట్లు 'ట' వర్ణక పరక 'చ' కారమునకు 'ప'త్వము గల దనుట మిక్కిలి పొరపాటు. అట్టి ప్రయోగము లశ్రిత చరములు.

అగు-వచ్చు-చొచ్చు-చూచుటకు వత్తు పరంబగ నప్పుడు 'కా-రా-చొచ్చు-చూడు' లగు ౯౫ (బా-క్రి-౯౧; వ్యా-సం-३३३ ఓష).

అగు: కాడు-కమ్ము-కాగల-కాన్-కన్ మొ. వచ్చు: రాడు-రమ్ము-రాన్-రాగల మొ చొచ్చు: చొరడు-చొరుము-చొరన్ - చొరగండు మొ. చూచు: చూడడు-చూడుము-చూడన్-చూడబడు (బాల-టుమ్ము-చువ్వె-క్రి-४३వ సూ.) మొ.

## ముత్పరక విధులు

౧వ వివ: ముత్పరకత్వము లేనిచోట బై యాదేశముల నాధునికులు ప్రయోగించుట భ్రాంతి వశాలకము. "చొరి" శ్రీకృష్ణ భారతము ౯వ ఆ-౨౭౨; చూ-బాలక-౮౧౭ పుట). ఇందిట్టివి పెక్కు గలవు.

ము త్తు పరంబగునప్పుడు 'ఇచ్చు' అనుదానికి 'ఈ' అనునది సర్వాదేశ మగును. జీత్తు పరమగునప్పుడు 'ఈయ-ఇయ్య' అన నాదేశములును నగును ౯౬ (బా-క్రి-౮౨; వ్యా-సం-४३४ వి).

ముజ్జు పరమగునపుడు : ఇమ్ము-ఈ. బహు-ఇండు. కానిమ్ము-కానీ, మొ జీత్తు పరమగునపుడు : ఈయకుము-ఇయ్యకుము-ఈకుము ఇయ్యకుండు-ఈకుండు. ఈయండు-ఇయ్యండు-ఈండు ఈన్-ఈయన్-ఇయ్యన్ మొ.

౧వ వివ : ద్విపద . వనరాశి త్రోవ యివ్వక...(రంగ-రా-బాలకాం.౮వ పుట). ఇది వ్యావహారిక రూపము. రంగనాథ రామాయణమునందలి వ్యావహారిక రూపములలో నిది యొకటి. ప్రామాణిక కవు, లెవ్వరును నిట్టివానిని ప్రయోగింపరు.

౨వ వివ: 'ఈవుతన్'(ఇచ్చుతన్)అను రూపము"సూ-రా-నిఘంటువున" నుదాహరింపఁబడెను ఇందలి 'వ' త్వము నిరాధారము. దీనిని నిర్వహించు మహాకవి ప్రయోగము లేదు.

'తే-తేరు'లు తెచ్చునకగు ౯౭ (బా-క్రి-౯౩; వ్యా-సం-౩౩౫ విష).

తెమ్ము-తే-తేరుము-తేరు. తెండు-తేరుఁడు. తేఁడు-తేరఁడు. తేన్-తేరన్, తేవలయు (ఆది-౨వ ఆ-౧౦౫) తేరఁ గడఁగె (ఆర ౩వ ఆ-౭౬).

''చావు-నోవులు'' ''చచ్చు-నొచ్చు''ల కగు ౯౮ (బా-క్రి-౯౪;వ్యా-సం-౩౩౬ విష).

చచ్చు : చావఁడు-చావుము. బహు-చావుఁడు నొచ్చు : నోవఁడు-నోవుము. బహు : నోవుఁడు. ద్విత్వము : నొవ్వఁడు-నొవ్వుము (అచ్చి-౩౬వ సూ).

జీత్తు పరంబగునపుడు నాని 'వు' వర్ణంబు విభాషను లోపించును ౯౯-(బా-క్రి-౯౫; వ్యా-సం-౩౩౬ విష).

చచ్చు : చాక-చావక. చాకుము-చావకుము. చాకుఁడు-చావకుఁడు. నొచ్చు : నోక-నోవక. నోకుము-నోవకుము. ముజ్జు పరం బగునపు డీ 'వు' లోపము లేదు 'నొచ్చు' అనదానికిఁ బర్యాయముగా 'నోయు' ధాతువు గలదు. దాని కీ యాదేశాదులతోఁ బనిలేదు. కం. ఆయాసపడుటఁ గనుఁగొని నోయుదు...(శాంతి-౨వ ఆ-౩౩౦).

అగుట-కను-కనులకు ముజ్జీత్తులు పరంబు లగునపుడు 'కా-నా-కాన' లు విభాష నగు ౧౦౦ (బా-క్రి-౯౬; వ్యా-సం-౩౩౫ విష).

ఈ సూత్రము యథాసంఖ్యాన్వయమున మూఁడు వాక్యములగుచున్నది. 1. అగునకు ముజ్జు పరంబగునపుడు 'కా' దేశము విభాషనగును (క్రియా ౯౫వ సూత్రముచే వచ్చు నిత్య 'కా' దేశమున కిది యపవాదము). 2. 'అను' ధాతువునకు జీత్తు పరంబగునపుడు 'నా' అను నాదేశము విభాషనగును. 3. 'కను' ధాతువునకు జీత్తు పరంబగునపుడు 'కాన' అను నాదేశము విభాషనగును. ఉదా: 1. అగు : కమ్ము-అగుము-అవుము (అచ్చి-౯౯వ సూ) - ఔము (క్రియా-౧౦౭వ సూ) కండు-అగుఁడు-అవుఁడు-ఔఁడు. 2. అను : నాఁడు-అనఁడు. నారు-అనరు. నాన్-అనన్. నాక-అనక. నాని-అనని. 3. కను : కానఁడు-కనఁడు. కానన్-కనన్. కానక-కనక మొ

## 'నేరుచు'-'పోవు'

'నేరుచు'నకు లాట్టునందును భూతార్థక రూపములందును* 'చు' వర్ణము బహుళముగా లోపించును. ముత్తు పరంబగునపుడు దీని తుది 'చు' వర్ణము వైకల్పికముగా లోపించును ౧౦౧ (బా-క్రి-౯౭; వ్యా-సం-౩౫౯ విష)

లాట్టు : నేచును-నేరుచును. నేర్తును-నేర్చెదను. కం ద్యూతక్రీడకుఁ గొండొక నేతున్ (విరా ౧వ ఆ-౧౯౬) భూతార్థ : నేచెను-నేరిచెను. నేచిన-నేరిచిన. నేచి-నేరిచి మొ. బహుళగ్రహణముచే - "కం. నీచేఁ దా రావ్యంతము నేచుకొనం గలరు" (వరాహ-౧౨వ ఆ-౭౭) యన్నగునవి సాధ్యములు ముత్తు: నేరఁడు-నేరుపఁడు. నేరుపుము-నేరువుము విభాళ్ళన కైనను నేరఁ బోలునే (ఆది ౧వ ఆ ౧౯). నేరువన్-నేరన్ మొ.

* సూరి భూతార్థములలో లిట్టునందు మాత్రమె 'రు' లోపము బహుళమని సూత్రించెను. ఆ పక్షమున నీ క్రింది భూతార్థక రూపములు సాధ్యములు కానేరవు. "నేచినయట్లు (మౌసం ౧వ ఆ ౨౧౫); నేచియు నేరకుండియును (దశకుమార-౩వ ఆ ౧౪౦; కేలన)

పోవునకు 'దుజ్మ త్తు'లు పరంబు లగునపుడు 'వు' లోపంబు విభాషనగు ౧౦౨ (బా-క్రి-౬౮; వ్యా-సం-౩౩౬ విష). *

దుక్కు- : పోవుదురు-పోదురు. పోవుదము-పోదము. మత్తు : పోవఁడు-పోఁడు. పోపన్-పోన్ పోవఁగలఁడు-పోఁగలఁడు. పోవకుము-పోకుము. పోవుదము-పోదము (ఉభయప్రార్థ). పోవుము-పొమ్ము-పో. పోవుఁడు-పొండు. "పదము-పద-పొదము-పొద" అనునవి "పొమ్ము" అను దానికిని, 'పొదఁడు' అనునది 'పొండు' అను దానికిని బర్యాయములు కావు. 'పొద-పద' మున్నగునవి క్రియా-౩౭వ సూత్రమున విస్తరించి చెప్పఁబడెను.

౧వ విష : అర్వాచీన కవులు 'తి' (భూతార్థక) వర్ణకము పరంబగునపుడును 'వు' లోపము ననఁగా యిలోపమును (చూ-క్రియా ౧౦౩వ సూ) ప్రయోగించిరి. ఉదా:-పోయితివి-పోతివి. పోయితిరి-పోతిరి. 'మనమే యమ్ముడు పోతిమో యితనికిన్ (వరాహ. ౧౦వ ఆ ౩౭వ ప; వ్యా-సం-౧౬౪౪-౧౬౪౫ పుటలు-చూ).

## అగు-పోవుల కడవ్రాల లోపము

'అగు-పోవుల' కడవ్రాల కిద్వ్యక్షంబులు పరంబు లగునపుడు యకారంబగు ౧౦౩ (బా-క్రి-౬౬, వ్యా-సం-౩౪౦ విష).

అగు. క్రియా ౧౦౭వ సూత్రము చొప్పున 'అయి'కి పాక్షికముగా 'ఐ' వచ్చును. అయి-ఐ. అయిన-ఐన. పోవు: పోయిన-పోయి- పోయిరి-పోయెను-

* సూరి "పోవునకుం దుజ్మత్తులు ముజ్ఞుం బరంబులగునపుడు 'వు' లోపంబుం 'బొద పదలు' విభాషనగు" (౬౮ క్రియా) అని సూత్రించెను. 'పొద-పద' అను వానితో నస్మదర్థ సాహిత్యమును గలదని క్రియా-౩౭వ సూత్రమున వివరింపఁ బడుటచే నిందు 'పొద-పద'ల యాదేశమును మరలఁ జెప్పలేదు.

పోయెడు-పోయెడి మొ. కం. అయినది నలువురు శార్ఙకు లయు మోషణము... (ఆది ౧వ ఆ ౨౯౪). ఈ యున్న పొష్య ప్రోలికిఁ బోయి...(ఆది-౧వ ఆ ౧౧౭).

౧వ వివ: కడత్రావాల కనుటచేత 'అగు' ధాతు 'గ' కారమునకే 'య' కారమయ్యె ననవచ్చును గాని యాపక్షమున-'అవితిని' మున్నగు ననిష్టరూప ములు దుర్వారములగును గాన 'అచ్చి ౮౯' చొప్పున వకారముచేసి దానికి 'య' కారము చేయనగును.

'అగు'నకు వక్రంబు గూడుచో దీర్ఘం బగు ౧౦౪ (బా-క్రి-౧౦౦; వ్యా-సం-౩౪౦ విష).

ఆయెను-అయ్యెను (అచ్చి ౩౮వ సూ. చొప్పున ద్విత్వమును, సమా-౭౮వ సూ. చొప్పున హ్రస్వమును గల్గెను. ఇట్లె-ఆయెడు-అయ్యెడు మొ. కం. వెఱ గయ్యెడు...।కయ్యము...(ద్రోణ-౩వ ఆ-౨౩౭)

## పిలుచు 'చు' లోపము

'పిలుచు' మొదలగువానికి ముత్తు పరంబగునపుడు కడవాయి బహుళం బుగ లోపించు ౧౦౫ (బా-క్రి-౧౦౧; వ్యా-సం-౩౪౧ I విష).

పిలఁడు-పిలువఁడు. పిలుము-పిలువుము. పిలన్-పిలువన్. పిలఁ గలఁడు-పిలువఁగలఁడు. బహుళగ్రహణంబుచే 'లేచు' నకు ముజ్జు పరంబగున పుడు 'చు' లోపంబు నిత్యంబు. లెమ్ము-లే-లెండు. పిలుచు-నిలుచు- తలఁగు-తొలఁగు- గెలుచు- వెఱచు ఇత్యాదులు. పన్నిదము చఱము (ఆది ౨వ ఆ ౩౨). చఱచు + ము-చఱము.

౧వ వివ: బా-గు-ప్ర. 'తలఁగు' నకు మాఱుగా 'తలఁచు' అను దానిని నిల్పుట పొరపాటు. 'తలఁచు'నకు 'చు' లోపమే లేదు. తలఁగు: కం. బల్లిదులు తలఁడు తలఁడని ...(భాగ ౧౦వ స్కం-పూ-౧౩౮౭-సూ-రా-ని). కం... ముం। గల నడచి కంచుకులు నుం। దల తల మనఁ బతియుఁ జతుర తరముగ నడచెన్ (నిర్వ-౧వ ఆ ౮౪). ఇట్టిని విరోధించును.

లాఁతిచో సహితము 'కా' దేశాదులు కానంబడియెడి ౧౦౬ (బా-క్రి-౧౦౨; వ్యా-సం-౩౪౨౭).

లాఁతిచో-ముత్తు కానివి పరమగునపుడును. కావుతన్-కాతన్ (చూ-క్రియా-౩౪వ సూ). అగుట-కావుట (ఆది-౧వ ఆ ౧౩౯ సిద్ధముకావు లెఱింగి). కానన్-కావునన్-అనుడును-అనవుడును-నావుడును మొ

౧వ వివ: 'రావించు-రప్పించు-కావించు' మున్నగు చోట్ల నిత్యము. ఇవి క్రియా ౮౦వ సూత్రము చేతనె సిద్ధించును.

౨వ వివ: చా బిడ్డ (బసవ-౭వ ఆ-౩౧౦-కడుపులోఁ జచ్చిన బిడ్డ). చా పరువు (మనుచ-౪వ ఆ-౪౫-చావునకుఁ దెగించిన పరుగు).

౩వ వివ: 'కావునన్-కానన్' అని ద్రుత ప్రకృతికములె న్యాయముగాఁ గావలయును. 'కాన్+అ-కాన' అను వ్యుత్పత్తి చొప్పున భారతమున నిది కళ గానె కన్పట్టుచున్నది. మ. ధృతరాష్ట్రిండును....కా న తగం బొందుట (ఉద్యో-౧వ ఆ-౩౫౮). భారతమున ద్రుత ప్రకృతికతను నిర్వహింపఁజాలు ప్రయోగ మగపడదు. "కం. రసభావా ద్యుపని బద్ధరసములు గానన్" (నరస ౫వ ఆ ౨౩౦) అను రీతి నర్వాచీనులు దీని ద్రుతాంతముగా వాడిరి.

## అయి-ఐ; అవు-ఔ

ఆచ్ఛికంబులందు 'అయి-అవు' అనువానికి* వరుసగా "ఐ-ఔ" అనునవి బహుళంబుగా నాదేశములగును ౧౦౭ (బా-క్రి-౧౦౩; వ్యా-సం-౩౪౭-౩౪౭ I విష).

అయిరి-ఐరి. అయి-ఐ. అయితిరి-ఐతిరి. అవును-ఔను. అవుట-ఔట మొ. శబ్ద ఖండము లందును నిట్లగును. అయిదు-ఐదు. అయిరేని-ఐరేని

* 'అయి,యవు'లకు అను సూరిగారి సిద్ధ ద్వంద్వము సంహితా యకారమును బాహుదికములు.

(బచ్చెన పనిచేసిన పెండ్లికుండలు). అవుడు-ఔడు (పెదవి క్రిందిచోటు). గవుసెన-గౌసెన మొ.

౧వ వివ: 'ఐ-ఔ' లకు 'అయి-అవు' అనునవి యాదేశములగుటయుఁ గలదు. ఉదా: కైక-కయిక. దైవమ్-తద్భవ (దై + అము-దయియము)-దయ్యము. యౌవనమ్-తద్భవ (జౌవనము-జవువనము)-జవ్వనము. ఇట్టిపద్ధతి మిక్కిలి యరుదనఁ దగును.

౨వ వివ: అచ్చికంబులం దనుటచే నీ పద్ధతి సంస్కృత సమములందు ప్రవర్తిల్లదు. ఉదా: దైవమ్-యౌవనమ్-దయిత (భార్య)-జైనముని భవుకము (మంగళము). కవులు-కైకయి మొ.

## లట్ప్రరకత్వమున 'కలుగు' నకు 'కల'

అస్త్యర్థకంబును ప్రాప్త్యర్థకంబును (సకర్మక)* నగు 'కలుగు' ధాతువునకు 'కల' అను నాదేశము లట్ప్రరకత్వమున నిత్యముగా నగు ౧౦౮ (బా-క్రి-౧౦౪; వ్యా-సం-౩౪౪ వి).

లట్టు-ప్రథ: కలఁడు-కలరు (కలవాఁడు-కలాఁడు-కలఁడు. కలవారు-కరులా-కలరు). కలదు-కలవు. మధ్య: కలవు-కలరు (కలవాడవు-కలాఁడవు-కలవు మొ). ఉత్త. కలను-కలము (కలవాఁడను-కలాఁడను-కలను మొ). ప్రాప్త్యర్థకత్వమందు- 'కలవు-కలను-కలము' అనునవి ప్రాచీన భాషలో లేవు. క్రియా ౨౧-౨౨వ సూ. చెప్పిన నుదంతము కామింజేసి "చు-ఉన్న" అనునవి

---

* సూరి అస్త్యర్థక 'కలుగు' ధాతువునకు మాత్రమే 'కల' అను నాదేశమును (బా-క్రి-౧౦౪) విధించెను. కాఁగా ప్రాప్త్యర్థక 'కలుగు'నకీ క్రింది రీతి రూపములు సాధ్యములు కానేరవు. 'ఎఱుకఁ గలరె మగువ లెందు (ఆది ౨వ ఆ ౩౪). ఇది వడిఁ గలదు మనము కంటె గాడ్పుకంటె (ఆది ౧వ ఆ-౧౧౫). జ్ఞానముఁ గలఁ డేనిన్ బాలుఁ డైనఁ గడు వృద్ధు మహిన్ (అర-౩వ ఆ-౨౪౦). షగటిమిఁ గలఁడనియెడు న మ్మిగఁ జూచుచు నుండు విషము ప్రమింగిన యేనిన్ (ఉద్యో ౧వ ఆ-౩౧౫).

రావు. క్రియా ౨౦వ సూ. చొప్పున 'ఉన్న' లేదు గాన "ది-వి" అనునవి రానేరవు లట్ప్రరకత్వమున 'కలా' దేశము నిత్యమగుటం జేసి "ధనలాభము గలుగుచున్నది" మున్నగుచోటులందు 'కలుగుచున్+ఉన్నది' అను రీతిని వర్తమానార్థక 'చు' వర్ణక ద్వారమున రూపసిద్ధి నరయునది.

౧వ వివ: అస్త్యర్థకత్వమున "కలవు-కలను-కలము" అను వానిని దిక్కనాదులు ప్రయోగించిరి. "నీ వచ్చుటఁ గలవొ లేవొ నిక్కము చెపుమా" (విరా-౪వ ఆ ౨౧౧). ఇట్లు తిక్కన 'ద' కార రేఫ లోపములను (కలవాఁడవు-కలాఁదవు-కలవు) సైత మంగీకరించెను. ప్రాప్త్యర్థమునందు సైతము 'కలవు-కలను-కలము' అను రూపములను సంస్కర్తలు ప్రక్షిప్తములను జేసిరి. కాని యా యా చోటులందు 'కలదు' అను సాధురూపమే కవిప్రయుక్తము. ఉదా: కం. నేరుపుఁ గల ననుచు నహం। కారంబున (హరి-పూ-౫వ ఆ-౨౪౭). ఇచట 'నేరుపు గల దనుచు' అనునదే కవిప్రయుక్తము (చూ-వ్యా-సం-౧౬౫౭వ పుట). బీరముఁ గల వేని (ఆర ౧వ ఆ ౩౦౯). ఇట 'బీరముగల దేని' అనునదే కవిప్రయుక్త పాఠము. ప్రాచీనులు "కలవాఁడను-కలాఁడను. కలవాఁడు-కలఁడు" మున్నగు రీతిని దచ్చుబడ్డ 'వకార-వాకార' లోపమును (సమా-౮౩వ సూ) బ్రయోగింతురే కాని ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతు స్థలమున "కలాఁడను-కలాను-కలను. కలారము-కలాము-కలము. కలాఁడవు-కలావు-కలవు" అను రీతిని దకార రేఫ లోప రూపములను బ్రయోగింపరు.

తద్ధర్మాద్యర్థ్యక విశేషణ స్థలము నందును నర్థద్వయమునందును 'కలుగు' ధాతువునకు "కల" అను నాదేశము విభాషనగు ౧౦౯ (బా-క్రి-౧౦౫; వ్యా-సం-౩౪౪ విష).

కలవాఁడు-కలుగువాఁడు-కలిగెడివాఁడు. కలాదేశము మీఁద 'ఎద్యేడు' లు నిల్వావు.*

---

* సూరి 'కలుగు' అనుదానిపైన సయితము 'ఎద్యేడు' లు నిల్వావని వచించుట పొరపాటు. కం ఏ। ర్పద జగములు గ్రమ్మఱఁ గలి గెడునప్పుడు (ఆర-౪వ ఆ-౨౩౭). సూరి ప్రాప్త్యర్థక 'కలుగు' ధాతువునకును దద్ధర్మాద్యర్థక త్వమున 'కలా' దేశమును దిక్కన ప్రయోగించె నని చూచుకొనలేదు.

అస్త్యర్థమందు 'కలుగు'-ప్రత్ధమున : ఉ. వాఁడిమయూఖముల్ గలుగు వాఁడు (అది-౩వ ఆ-౧౧౨). కొడుకులు గలవాఁడు (ఆది-౮వ ఆ-౨౫). ప్రాప్త్యర్థమందును 'కలా' దేశము : కం. తిరమైన నడవడిం గల। పరిణత చిత్తుండు (శాంతి-౫వ ఆ-౧౮౯).

## లజ్యాది పరకత్వమున 'కల్గు'

'కలుగు' నకు "లజీ-మిజీ-కజీ-నిజీ-వడి" ప్రత్యయములు పరమగు నపుడు 'లే' అనునది సర్వాదేశమగు ౧౧౦ (బా-క్రి-౧౦౬; వ్యా-సం-౩౪౪వి).

(క్రియా-౧౫వ సూ-లజీ. క్రియా-౪౮ మిజీ క్రియా-౫౦ కజీ. క్రియా-౫౩ నిజీ. కృత్-౨౨ వడి చూ). ప్రాప్త్యర్థకత్వమున వ్యతిరేకమునందు "లేవు లేను-లేము-లేవడి" అను రూపములు లేవు. తక్కిన యన్ని యెడలఁ బ్రాప్త్యర్థ మందును నస్త్యర్థమున నంతటను వ్యతిరేకమున 'లే' అను నాదేశ మగు నని యెఱుంగునది. అస్త్యర్థ వ్యతిరేక : ప్రథ : లేఁడు-లేరు. లేదు-లేవు. మధ్య : లేవు-లేరు. ఉత్త : లేను-లేము. తక్కిన : లేమి-లేక-లేని-లేవడి. నీవచటఁ గలవొ లేవొ (విరా ౪వ ఆ-౨౧౧). ప్రాప్త్యర్థ వ్యతిరేక : మధ్యమ-బహు-లేరు. ప్రథ : లేఁడు-లేరు * లేదు-లేవు. 'మి' ప్రభృతి : లేమి-లేక-లేని. మా యందు లేని గుణములు (ఆర ౧వ ఆ ౮). సామర్థ్య; గెలువలేమి (భీష్మ ౨వ ఆ ౩౫౨).

౧వ వివ: ప్రాప్త్యర్థకత్వమందును 'లేవు-లేను-లేము' అనువానిని గొన్ని యెడల ముద్రణసంస్కర్తలు ప్రక్షిప్తములు చేసిరి. అట్టియెడల నెల్ల 'లేదు' అను నదే కవి ప్రయుక్త పాఠము. ఉదా : అంత యెఱుక లేనె (లేని దాననె; ఆర ౧వ ఆ-౨౩౧). ఇట "అంత యెఱుక లేదె" అనియే కవి ప్రయుక్త పాఠము.

---

* సూరి ప్రాప్త్యర్థకత్వమున వ్యతిరేకమందు 'లే' అను నాదేశమే లేదనుకొనుట కేవలము పొరపాటు. కం. ధృతరాష్ట్రిండును బుత్త్రిలు। మతి లేరైరి (భీష్మ ౩వ ఆ ౨౨౭). లావు లేరైరి (ఆశ్రమ ౨వ ఆ ౧౫౨).

## 'వలచు' వ్యతిరేకరూపములు

వ్యతిరేకంబునందు 'వలచు' నకు 'ఒల్ల' విభాషనగు ౧౧౧ (బా-క్రి-౧౦౭; వ్యా-సం-౫౪౬ విష).

ప్రథ : ఒల్లఁడు-ఒల్లరు. ఒల్లదు-ఒల్లవు. మధ్య : ఒల్లవు-ఒల్లరు. ఉత్త: ఒల్లను-ఒల్లము. ఒల్లమి-ఒల్లక-ఒల్లని. ఒల్లాదేశాభావ పక్షమున : ప్రథ- వలవఁడు-వలవరు మొ॥ క్రియా ౯౧వ సూ. చెప్పున 'వలచు' ధాతు సిద్ధ 'చ' కారమునకు 'వ' కారాదేశము. ఆ. వె...జముఁడు వట్టికొన్న వానినైనఁ గావ వలతురు వలచిన నొల్లకున్న (ద్రోణ ౨వ ఆ-౨౯౦).

౧వ వివ : వ్యతిరేక భావార్థమున 'ఒల్లమి' అను దానికిఁ బర్యాయము 'ఒల్లఁబాటు' అనునది యగు నందురు. కాని 'ఒల్లఁబాటు' శబ్దములోని పూర్వావయవము "ఒల్లన్" అను భావార్థక నిపాత మనుట యుక్తము (చూ-సంధి-౨౬). గీ. ప్రాణములు నర్థములు నొల్లఁ బాటు సేసి (భీష్మ ౧వ ఆ-౧౮౨).

౨వ వివ : 'వలవదు-వలదు' అనునవి పర్యాయ రూపములుగా నగపడును. కాని 'వలవదు' అనునది 'వలచు' ధాతు వ్యతిరేక రూపము. 'వలదు' శబ్దము 'వలయు' ధాతు వ్యతిరేక రూపము. చేయవలయు-చేయవలదు. 'వలదు' శబ్దమునుండి "వలదు-వల్దు-వద్దు'' అను రీతిని రూపము ఉుప్పతిల్లును.

## ఘటక క్రియలు

స్వార్థ వ్యతిరేకము లందలి కొన్ని క్రియల తుదిని జేరిన 'అగు-పోవు' మున్నగువాని స్వార్థిక వ్యతిరేక రూపములు వివిధములగు నర్థ విశేషములకు ఘటకము లగును. కావుననె యవి ఘటకక్రియ లనఁబడును. అట్టి జంటలందు వివిధములగు నాగమాదేశ లోపాదులును గల్గును. ఇట్టి జంట లీవఱకును గొన్ని సందర్భాంతరములందు సూత్రింపఁ బడెను. ఇంకను సూత్రింపఁబడును ౧౧౨ (బా-క్రి-లేదు; వ్యాసం-౩౪౭ విష ౧౬౬౩ పుట మొ. ౧౬౬౭ పుటలు).

ఉదా : నమ్మనేర నయ్యెదన్ (ఆది-౪వ ఆ-౩౦) మనఁ బోవక పోవఁగ రాదు (ఉద్యో-౩వ ఆ-౪౬). వృష్టిచే దవుఁగ (ఆది-౪వ ఆ-౨౪౯). పుట్టి దయ్యెనే-పుట్టరైరె (ఆది-౬వ ఆ-౬౦). నాకుఁ బని సేయ దయ్యెనేనిన్ (ఆది-౩వ ఆ-౧౩౨). ఈఁ జాల నయ్యెదన్ (ఆర-౭వ ఆ-౩౬౪). రాక పోఁడు-ఉండక పోఁడు (మనుచ-౩వ ఆ- ). చేయనే చేయఁడు. చేసెనా చేయును. చేయ నిమ్ము. చేయ నగును. చేయ రాదు. చేయఁదగును. చేయఁ దగదు - చేయ రాదు. చేయఁ గూడదు (క్రియా-౪౭వ సూ. లో వివరింపఁ బడెను). తెలియఁ జేసెను. ఒనరఁ జేసెను (క్రియా-౭౩వ సూ-౩ వివ). పండఁ బాఱిన పొల మెండఁ బాఱెను (ప్రారంభార్థకములు. పండ నారంభించిన పొల మెండుట కారంభించెను. మనుచ ౩వ ఆ-౧౨౯). చేయ నున్నాఁడు-చేయఁ బోవును (ఇవి భావ్యర్థమునే యిచ్చును. ధాతువు నుఙ్యంతముపైని 'ఉండు-పోవు' ధాతు రూపములు నిల్చి భవిష్య దర్థబోధకము లగును). చేయఁ గలఁడు (భావ్యర్థమున నుఙ్యంతముపైని కల్గు' ధాతువు చేరును. క్రియా-౨౭వ సూ; ఇట్టిదె సామర్థ్యార్థకము నగును). చేయుచున్నాఁడు (వర్తమానార్థమున చువర్ణాంతముపైని 'ఉండు' ధాతురూపములు నిల్చును- క్రియా-౨౨౧వ సూ). చేయఁబడును (ధాతువు నుఙ్యంతముపైని 'పడు' ధాతురూపములు నిల్చును; క్రియా-౫౯వ సూ). చదువుకొనును (క్రియా-౬౨వ సూ; ఆత్మనేపదార్థకము). చేయఁ జూచెను (యత్నార్థకము-చేయ యత్నించెనని యర్థము). చేయరైరి-చెప్పనయితిని (క్రియా-౧౧౦). చేయరా-ఏమిర- వచ్చెం జుమా- చదువవె-చదువవయ్య-చనుదెంచెను (గమనార్థకములు 'తెంచు' యోగమున 'ఆగమనా'ర్థకము లగును; క్రియా-౧౧౬). తెల్లగాన్-లెస్సగాన్-చేయఁగన్-చెప్పఁగాన్ (౧౧౯-క్రియా) - పండుకొనెను-చొరఁబడెను (క్రియా-౧౧౩వ సూ) మొ.

౧వ వివ : ఇట్లు ధాతువులె కాక కొన్ని నామముల జంటలున్ను నర్థవిశేష బోధకము లగును. ఉదా : తీయ విలుకాఁడు-తీయ విల్తుఁడు-పచ్చ విలుకాఁడు-పచ్చవిల్తుఁడు-చెఱకు విల్కాఁడు (మన్మథుఁడు) మొ.

పడుటి 'కొను' లోకానొకచో స్వార్థంబునం దనుప్రయుక్తము లగు ౧౧౩ (బా-క్రి-౧౧౯; వ్యా-సం-౩౪౩ I విష).

క్రియా-౩౯-౬౨ సూత్రముల చొప్పున నకర్మకములు కర్మార్థకములు నాత్మనేపదార్థకములును కానేరవు. కాన నట్టియెడ నిల్చు 'పడు-కొను'లు స్వార్థికము లననగును. ఉదా : చొరఁబడెను (చొచ్చెను ; క్రియా-౯౨వ సూ. చొరు). నిలువఁబడును (నిలుచును). కూడఁబడును. పండుకొనును మొ.

## 'తెంచు' ధాత్వనుప్రయోగము

తెంచు ధాతు వగ్వాదుల కనుప్రయుక్తం బగు. ముత్తు పరంబగునపుడు 'తెంచు'నకు 'తే-తేరు' లగును ౧౧౪ (బా-క్రి-౧౧౦ ; వ్యా-సం-౩౪౭ IV విష).

అగు-నెగయు-పోవు-చొచ్చు-వుచ్చు-తోఁచు - నడచు-పఱచు -మొలచు-వీచు-అరుగు-ఏఁగు-చను ఇత్యాదు లగ్వాదులు. చనుదెమ్మనుము (ఉద్యో-౧వ ఆ-౧౭౬).

ఉత్వంబుపైని "తెంచు" 'త' కారము 'ద'కారంబగు ౧౧౫ (బా-క్రి-౧౧౦ ; వ్యా-సం-౩౪౭ IV విష.

అగుదెంచు (కావచ్చు-పూర్తి కావచ్చు). నెగయుదెంచు (జలాదులనుండి పైకి లేచు). పోవుదెంచు (సమాప్తి కావచ్చు). అగుదేన్-అగుదేరన్ మొ. ఏనేఁడు లగుదెంచె (అర-౪వ ఆ-౩వ ప). మునిశాప దినములు పోవుదెంచె (ఆది-౨వ ఆ-౧౯౯).

అరుగ్వాదులకు "తెంచు" పరంబగునపుడు 'గు' లోపంబు విభాష నగు. వీనిని ప్రాచీను లాగమనార్థమందె వాడుదురు ౧౧౬ (బా-క్రి-౧౧౧ ; వ్యా-సం-౩౪౭ IV విష).

అరుగుదెంచు-అరుదెంచు (వచ్చు). ఏగుదెంచు-ఏతెంచు (వచ్చు ; గులోపము రాఁగా 'ఉ'కారాంతత్వము లేమింజేసి 'ద'త్వము రాదయ్యె). చనుదెంచు (వచ్చు). ప్రీతి నరుదెంచి కనిరి (అర-౩వ ఆ-౧౩౯) మీ రిందుల కందఱుఁ

జను దేరఁగ (ప్రాసస్థలము ; సభా-౨వ ఆ-౧౩౬). అర్వాచీనులు 'వెళ్ళు' అను నర్థము : పురికేగుదెంచి...ఏమని విన్నవించెదర్ (జై-౨వ ఆ-౭౩ ; ఏగు దెంచి-వెళ్ళి). చంచలలోచన యెం దరుదెంచెనో (రసిక-౬వ ఆ-౪౪ : జై-౪వ ఆ-౧౨౨). ఎట్లు మింటఁ జనుదేరఁగ (పోవు చెట్లు).

'తెంచు' పరంబగునపుడు 'పీచు' ప్రభృతుల తుది 'చు'వర్ణంబు లోపించు ౧౧౭ (బా-క్రి-౧౧౨ ; వ్యా-సం-౩౪౭ IV విష).

పీచు + తెంచు-పీతెంచు (గాలి విసరు). మొలతెంచు (మొలచు + తెంచు-అంకురించు). పఱతెంచు (పఱచు + తెంచు-పరుగిడివచ్చు). తోఁతెంచు (తోఁచు + తెంచు-ఉదయించు మొ. సూ-రా-నిఘంటువున నిది నిర్బంధువుగా 'తో తెంచు' అని యుదాహరించుట ప్రామాదికము. చూ-వ్యా-సం-౧౬౭౧వ పుట). పుచ్చు + తెంచు-పుత్తెంచు (పంపు) చొత్తెంచు (చొచ్చు + తెంచు-చొరఁబడు). తదలు చకారముతో సంధించునపుడు ద్విత్వ తకార మేర్పడుట కవి ప్రయోగ సిద్ధము. సీ...పు త్తెంచెఁ గాకున్న నేరఁ డిశఁడు (అర-౧వ ఆ-౨౨ ; పుచ్చు + తెంచు). ఆ-వె. ఇత్త మెల్లభంగి నిత్తన్వి (నిర్వ-౩వ ఆ-౧౧౭ ; ఇచ్చు + ద + ము-ఇత్తము).

భూతంబున లజికి భూత తద్ధర్మా * ద్యర్థకం బగు 'అగు' ధాతు వను ప్రయుక్తంబగు ౧౧౮ (బా-క్రి-౧౧౪ ; వ్యా-సం-౩౪౮ V వి).

లజికి-వ్యతిరేకార్థక క్రియకు - ఉదా : భూత : ప్ర. వాఁడు రాఁడయ్యెను. వారు రారయిరి. అది రాదయ్యెను. అవి రావయ్యెను. మధ్య : నీవు రావయితివి. మీరు రారైతిరి. ఉత్త : నేను రానయితిని. మేము రామయితిమి. తద్ధర్మాద్యర్థ : నేను రానయ్యెదను-నమ్మనేరనయ్యెదను (ఆది-౪వ ఆ ౩౦ ; చూ-క్రియా-౧౧౨వ సూ).

---

*సూరి లిడంతంబగు 'అగు' ధాతువు మాత్రమె యను ప్రయుక్తమగు నని సూత్రించెను. ఆ పట్టున "నమ్మనేర నయ్యెదను" (ఆది ౪వ ఆ ౩౦) మున్నగు ప్రయోగములు సంగ్రహింపబఁడవు.

## 'కాన్-కన్' అను వాని ప్రయోగము

'అగు' ధాతు నుజ్యంతరూప మగు 'కాన్' అనునది వికల్పకముగ హ్రస్వము నందును. ఇవి (కాన్-కన్) క్రియా విశేషణములకును, విధేయ విశేషణములకును, నుజ్యంతములకును బరముగా విభాషను నిల్చును. కొన్నిట నివి యన్వితము లగును. కొన్నిట వ్యర్థములై యనుప్రయుక్తము లగును. ఇవి ప్రథమమీఁద నిల్చునపుడు 'గ' కారాదేశము నిత్యము (చూ-సంధి ౧౪వ సూ) ౧౧౯ (బా-క్రి-౧౧౫-౧౧౬; వ్యా-సం-౩౪౭ VI విష).

క్రియయందలి విశేషమును దెల్పునది క్రియా విశేషణము. ఉదా.: అది వేగముగా వచ్చెను; వాఁడు లెస్సగాఁ బల్కెను. నామమందుండు విశేషమును దెల్పుచు, ననఁగా నామవిశేషణ మగుచుఁ గ్రియతో నన్వయించునది విధేయ విశేషణము. ఉదా: వాఁడు పల్కినది న్యాయముగా నున్నది. ఇట్టి యెడల 'కాన్-కన్' శబ్దములు వాక్యమున నన్వితములై యగుచున్నవి.* నుజ్యంతములమీఁద నివి యనుపయుక్తములై యనఁ దగును. ఉదా: నేను వినఁజెప్పుము-నేను వినఁగాఁ జెప్పుము. క్రియావిశేషణ విధేయ విశేషణముల మీఁద నివి నిల్వక పోవచ్చును. పెల్లు దొరగు నెత్తురునై (భీష్మ-౧వ ఆ-పరీక్షితున్...కృతాంత నికేత నాతిథిని జేసె (ఆది-౧వ ఆ-). ఇట ద్వికర్మమన్నను ననవచ్చును (చూ-వ్యా-సం-౧౬౩౦వ పుట). ఇవి భావార్థకాదులందు నిల్చుటయుఁ గలదు. చదువఁగఁ గలఁడు-చదువఁగలఁడు. చదువఁగఁబడెను-చదువఁబడెను. వినఁగావలయు-వినవలయు మొ. (క్రియా-౯౫వ సూ. 'కాన్' సిద్ధించును.)

---

*సూరి క్రియా విశేషణములకు నిత్యముగా ననుప్రయుక్త మగునని సూత్రించుట సరికాదు. క్రియా విశేషణములపై ని సైతము నిల్వక పోవచ్చును. ఉదా: పెల్లు దొరఁగు నెత్తురునై (భీష్మ-౧వ ఆ: చూ-ప్రౌ-క్రియా-౨౨వ సూ). లెస్సగాఁ బల్కె ననుచో లెస్స యగునట్లు పల్కె నని 'కాన్' శబ్ద మన్విత మగుచుండుటచే దాని ననుప్రయుక్త మనరాదు. ఇది విధేయ విశేషణములకు పయిని నిల్చును. "బాహుబల గర్వ మఖర్వముగా" (కర్ణ-౨వ ఆ-౧౦౫).

౧వ వివ : ఉదా : కావున నీకు నప్రియము౯ గౌరవరాజునకుం బ్రియం బునుం।గా విధి మెచ్చ బాహుబల గర్వ మఖర్వము గా(గ లక్ష్మి కిం జేవయు౯ గీర్తి కున్నత విజృంభణముం గలుగన్ ముకుంద గాం డీవుల౯ దాఁకి గెల్చెద౯ గడింది మగంటిమి యుల్లసిల్లఁగన్। (కర్ణ-౨వ ఆ-౧౮౫). ఇందు వివిధములైన 'కాన్-కన్' శబ్దముల వాడుకల నరయ వలయును.

౨వ వివ : 'కానున్నది' మున్నగు చోటులందును 'కాన్' అను దానికి హ్రస్వము గల్గుట గలదు కం. సవతి కయ్యెము...కనున్నది. (కళా౧వ ఆ-). నీకు నాథుఁడు గనున్న (కళా-౫౨ ఆ-) కం...కృతకృత్యుఁడు గవలయు... (అను-౪వ ఆ-౨౬) ; అధీశుఁడు గఁగోరు (నన్ని-కు-౬వ ఆ - ౭౨౨ ; చూ-వ్యా-సం-౧౬౮౨వ పుట).

౩వ వివ · 'భుగుల్ భుగుల్ గా౯ గ్రక్కెన్' (హ-హరి-౪వ ఆ-౨౩౧ ; భుగుల్ భుగు లనునట్లుగా౯ గ్రక్కెనని యర్థము). నీకుఁగా నని సేయుట (భీష్మ-౧వ ఆ-౧౫౩-నీకై-నీపక్షమున యుద్ధము చేయుట) ఇట్టి వాడుకలును గలవు. మఱియు 'మొదలుగాన్' అనదానిని ''మొదలుగాఁగల'' అను నర్థమున వాడు సంప్రదాయమును గలదు. మత్తకోకిల. అంబు ధీశుఁడు లోనుగా సురలు (ఆర-౪వ ఆ-౨౬౮). ద్రోణాచార్యుఁడు మొదలుగాఁగ౯ నని కొల్లనివారై (ఉద్యో-౨వ ఆ-౨౫౦ ; ద్రోణాచార్యుఁడు మొదలుగా౯ గలవారని యర్థము).

## శబ్దపల్లవ క్రియలు

పూర్వావయవము ప్రథమా ద్వితీయాన్యతర విభక్తిగ నుండు నామ మయి యుండ నుత్తరావయవము ధాతు వగు జంట శబ్దము శబ్ద పల్లవ సంజ్ఞ గల దన౯ దగును. ౧౨౦ (బా-కి-౧౧౮ ; వ్యా-సం-౩౪౮ విష). *

---

* సూరి వికృతివివేక టీకానుసారియై ''ధాత్వాదులకు ధాతువు లను ప్రయుక్తంబు లయి విలక్షణార్థాభిధాయకంబు లగు; నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు'' అని సూత్రించెను. ఇందలి విలక్షణార్థాభిధాయకత్వ మొక శబ్ద పల్ల వాసాధారణ ధర్మము కాదు. జంట శబ్దములలో నర్థ విశేషము సాధారణముగ౯ గల్గుచుండును. శబ్దపల్లవములలోని యుత్తరా వయవమును దాని (శబ్దపల్లవముయొక్క) యర్థములోఁ గొంతభాగము గలదై యుండును గాన నది యర్థము లేనిది కాదు. కాన

ఇట్టి సంజ్ఞను జేయుటచేతఁ దక్కిన ద్వ్యవయవము లగు జంట శబ్దములను (౧౧౨ మొ ౧౧౯ వఱకు క్రియా). శబ్దపల్లవములనుట సంప్రదాయము కాదనియు, వానిని ద్వ్యవయవ క్రియ లనియె వాడవలయు ననియు నెన్నఁగును (చూ-ప్రౌఢ-క్రియా-"శబ్దపల్లవక్రియలును ద్వ్యవయవ క్రియలును సమాప్తం బులై"...౨౫).

పూర్వావయవము ప్రథమాంత మగునపు డా శబ్దపల్లవ మకర్మక మగును. ఉదా : రూపఱు (రూపుచెడు-నశించు). పెంపఱు (నశించు) అలవడు (వశపడు). చొప్పడు (జాడపడు). వెలుపడు (బయలుదేఱు). ఆపోవు (ఆదట పోవు). విజయంచేయు మొ.

పూర్వావయవము ద్వితీయాంత మగునపు డా జంట సకర్మము కావచ్చును. అకర్మకమును గావచ్చును. ఉదా : అకర్మక : చిందులాడు (నర్తించు). చెట్టవట్టు (వీఁపు మీఁదిభాగము చెట్ట). నాట్యమాడు (నర్తించు). రక్కొను-రెక్కొను (రేకుకొను-వర్ధిల్లు). కోల్పడు (చెడు). మేలుకొను-మేలుకను (నిద్ర లేచు). వాసపోయు మొ. సకర్మక : చేకొను-తోడుకొను (తోడ్కొను-తోకొను) ఈకొను (ఈయకొను-ఇయ్యకొను-అంగీకరించు) తలపోయు (తలఁపు లను బోయు-ఆలోచించు).

ద్వ్యవయవశబ్దములు : కూరుచుండు (కూరుచు + ఉండు). నిలుచుండు (నిలుచు + ఉండు). పన్నుండు-పరుండు (పడు + ఉండు). త్రెక్కొను (తెంచు + కొను-చంపు). ఏఱుపడు-ఏర్పడు (ఏఱు-క్రిందనున్న గింజల నేఱు) మొ.

---

దాని ననుప్రయుక్త మనరాదు. మఱియు శబ్దపల్లవములలో నాద్యవయవము ధాతువై యుండరాదు. క్త్వార్థకాదికమును గాదు. అట్టివి ద్వ్యవయవ క్రియ లనిపించుకొనునే కాని శబ్దపల్లవము లనిపించుకొనవు (చూ-వ్యా-సం-౩౪౮ విష. ౧౬౮౨-౧౬౮౩ పుటలు).

౧వ వివ: శబ్దపల్లవక్రియలును ద్వ్యేవయువ క్రియలును సమాప్తంబులయి పునర్గృహీతంబు లగుచోఁ దత్పూర్వావయవంబులకు లోపంబు విభాష నగు. ఆ లలితాంగిఁ దోడ్కొని చనుదెమ్మతే ననువు గూడని పక్షమందు (భోజ-౩వ ఆ-). ఇలకుం దివికిం జననిచ్చు-నిచ్చి (భాస్కర-అరణ్య కాం-౨వ ఆ; ప్రౌఢ-క్రియా-౨౩వ సూ).

## ఆత్మార్థా ద్యభిధానము

ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగ సంఖ్యాభిధాయి వచనంబు ధాతు విశేషణంబుల కగు ౧౨౧ (బా-క్రి-౧౨౦; వ్యా-సం-౩౫౦ విష).

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహితంబుగఁ బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె. తాను శబ్దార్థమె యభిహితంబు కానిచో "రాముండు సీతయుం బుష్పకారూఢులయి యేతెంచి రని యుండును. సీ. ధర్మతనయుఁ। దనుజులుఁ దానును జన దెంచె (ఆది-౮వ ఆ-౬౩; చూ-వ్యా-సం-౧౬౯౯, ౧౨౦౦ పుటలు).

౧వ వివ : ఒకానొకచో సహార్థంబున యుష్మ దస్మ దర్థంబు లభిహితంబు లగునపుడు క్రియయు తత్కర్తృకంబును విభాష నగు. ఉదా : విప్రకులుండ ! వెల్వడుము వేగము నీవును నీ నిషాదియున్ (ఆది-౨వ ఆ). కం. మన కాప్తుఁడు సంజయుఁడు......ఆ లనిఁ బొందిన బ్రదుకు దీవు తన గ్గలు సుతులుగా (ఉద్యో-౨వ ఆ). నేను నా సేనయు దాఁవెట్టెద విశృంఖలతన్ (హరి-ఉ-౩ ఆ-౯౪వ ప ; ప్రౌఢ-క్రియా-౨౬వ సూ).

౨వ వివ : యుష్మ దస్మ ద్భిన్నకర్తృక మగునపు డనేక కర్తృక క్రియకు సమీపకర్తయొక్క లింగ వచనంబు లగు కం. ఏ వాని బంధు మిత్రులు। జీవ ధనంబులును దప్పిఁ జెందును గృపనిం। గా వాని నెన్నఁ గాఁదగు (శాంతి-౧వ ఆ ; ప్రౌఢ-వాక్య-౧౩౫ సూ).

సకర్మకంబులకు 'కొను-పడు' అనెడి యనుబంధము లుండవచ్చును గాన స్వరూపమున నాల్గును, ప్రేరణ మున నాల్గును నెనిమిది రూపంబు లేర్పడును ౧-౨-౨ (బా-సూత్ర సంఖ్య-లేదు ; వ్యా-సం-౩౩౩ విష).

౧వ వివ : స్వరూప : స్వరూప 1 + కొను చేరినది 1 + పడు చేరినది 1 + 'కొను-పడు' లు రెండును జేరినది 1-నాల్గగును ప్రేరణ : ప్రేరణము 1 + దానిపయి కొను చేరినది 1 + పడు చేరినది 1 + కొను పడులు రెండును జేరినది 1-నాల్గగును.

౨వ వివ : స్వరూప : 1. మైత్రుఁడు వంటకమును వండెను. 2. మైత్రుఁడు వంటకమును వండికొనియెను-ఆత్మనే పదార్థకము 3. మైత్రుని చేత వంటకము వండఁబడియెను-కర్మార్థకము. 4. మైత్రునిచేత వంటకము వండి కొనఁబడియె-ఆత్మనేపద కర్మార్థకము.

ప్రేరణ: 1. చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించెను-ప్రేరణము. 2. చైత్రుఁడు మైత్రునిచేత వంటకమును వండించుకొనియెను-ప్రేరణాత్మనేపదార్థకము 3. చైత్రునిచేత మైత్రుని చేత వంటకము వండింపఁబడియెను-(ప్రేరణ కర్మార్థక రూపము). 4. చైత్రునిచేత మైత్రునిచేత వంటకము వండించికొనఁబడియెను (ప్రేరణాత్మనేపద కర్మార్థకము).

అకర్మక ధాతువుల క ప్రేరణంబున నాత్మనేపద కర్మార్థము లుండనేరవు గాన నకర్మకత్వమున నొక భేదమును ప్రేరణార్థమున నాల్గును గల్పి యైదు రూపంబు లుండును ౧-౨౩.

అకర్మకముల క ప్రేరణంబున : మైత్రుఁడు మనియెను. అకర్మకములకుఁ ప్రేరణమున : 1. చైత్రుండు మైత్రుని మనిచెను (ప్రేరణార్థకము). 2. చైత్రుండు మైత్రుని మనిచికొనియెను (ప్రేరణాత్మనేపదార్థకము). 3. చైత్రునిచేత మైత్రుఁడు మనుపఁబడియెను (ప్రేరణకర్మార్థకము) 4. చైత్రునిచేత మైత్రుఁడు మనిచికొనఁబడియె (ప్రేరణాత్మనే పద కర్మార్థకము).

౧వ వివ : వెండియుం బ్రేరణంబునం దించు గాగమము గల్గినచో సకర్మకంబునకుం బండ్రెండును నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులు గల్గునని యూహించునది.

ఇది క్రియా పరిచ్ఛేదము

౦) —(౦

# బాలవ్యాకరణోద్ద్యోతము

## కృదంతపరిచ్ఛేదము

౧వ వివ. క్రియా ౧ 'ధాతువు' అను నధికారసూత్రము కృదంత పరిచ్ఛేద సమాప్తి వఱకును నన్వయింపవలయును. ధాతువునకుఁ బరమఁగా విహితములగు ప్రత్యయములలో "శత్రాను (క్రియా ౧౬వ సూ), ఇంచుక్కాను (క్రియా ౩వ సూ-౨౩వ సూ), చుక్కాను (క్రియా ౨౬వ సూ), పుక్కాను (క్రియా ౪౨వ సూ), పద్యనుబంధమును (క్రియా ౫౯వ సూ); 'కొను' శబ్దంబును (క్రియా ౬౩వ సూ)" అనునవి తప్పఁ దక్కిన యీవలఁ కుపదేశించిన 'ట' మున్నగు (క్రియా ౪౬వ సూ-మొ-౫౨వ సూ-వ) ప్రత్యయములును నిటపైని జెప్పఁబడు 'క' ప్రత్యయాదులును 'కృత్తు' లనఁబడును.* ఇంచుగంతములు మొదలయినవి ధాతువులె యనఁబడును. తద్ధితాంతములకువలెనె కృత్ప్రత్యయాంతములకును కార ౧వ సూ ౧వ వివరణము చొప్పునఁ బ్రాతిపదికత్వము కల్గును. దానిపయిన వాక్యాన్వయ యోగ్యములగు విభక్త్యాదులు నిల్చును.

అట్టి కృత్తులు రెండు విధములు: 1. అచ్చిక కృత్తులు: "ట-అమి-ఇ-అక మొ. చేయుట-చేయమి-చేసి-చేయక-చేయన్-చేయుచున్-చేసినన్-చేయుచున్న-చేయఁగల-చేసిన-చేయని-చేయు-చేసెడు-చేసెడి చేయన్ (వలయును)" మొదలగునవి యీవలఁ కుపదేశించినవి. వక్ష్యమాణములు క-ఇమి మొ ఎఱుక-పూనిక-కలిమి-కూరిమి-చేఁత-కూఁత మొ. 2. సంస్కృతికములు: అన-తవ్య మొ. అన: కృ + అన-కరణము. భూ + తవ్య-భవితవ్యము. ఇట్లె భవనము-గన్తవ్యము మొ.

అచ్చిక కృత్తుల యర్థములు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు ౧ (బా-కృ-౧వ సూ; వ్యా-సం-౩౫౫ I విష).

---

* "ధాతువునకు విహితంబయిన 'డుఞ్' భిన్న ప్రత్యయంబు కృత్తనఁబడు" అని సూరి వచించెను. ఈ పక్షమున 'ఇంచుక్కు' మున్నగుననియుఁ గృత్తు లను భ్రాంతి గల్గును.

ఒక్కొక్క ప్రత్యయమె వివిధార్థంబుల నగుమందును. మొలక (ఇది కర్త్రర్థకము) కాపక (ఇవి కర్మార్థకము)

## ధాతువు తుది 'కా' దుల లోపము

ఇటం గృత్ "క-గ-త-ప వేములు (వ+ఇమి)" పరంబులగునపుడు ధాతువు తుదియున్న "క-గ-చ-య-వ" లకు లోపంబగు ౨ (బా-కృ-౨; వ్యా-సం-౩౫౬ విష).

ఆచ్ఛిక కృత్సంబంధులగు కాదులు పరంబు లగునపుడు ధాతువు తుది 'క-గ-చ-య-వ' లకు వానిమీఁది యచ్చులతోఁగూడ లోపం బగునని యర్థము. 'ఇట' అనుటచేత ని విధి యీ యాచ్ఛిక కృత్పరిచ్ఛేదమందు మాత్రమె వర్తిల్లునని యెఱుంగునది. కాన "కలుగు+క = (క్రియా ౩౦ సూ) కలుగక" మొదలగు క్రియాపరిచ్ఛేదోక్త కృత్ప్రత్యయముల యెడల నయిత మీవిధి వర్తిల్ల నేరదు. ఉదా : అఁగు+క (అచ్ఛి-కృత్-౩వ సూ) అఁక. మురియు+ప (అచ్ఛి-కృ-౮వ సూ) మురిపము. కలుగు+ఇమి (అచ్ఛి-కృత్-౦వ సూ) కలిమి. ఈ యాచ్ఛిక కృత్ప్రత్యయములలో నెల్లవియు నాకృతి గణ ఘటితములె. ౯౦దలి 'ఇమి' అనునది 'ఇడి' మున్నగువాని కుపలక్షణము (చూ-కృత్తు ౨౬వ సూ).

'క' వర్ణకం బలుగ్వామల కగు ౩ (బా-కృ-౩వ సూ, వ్యా-సం-౩౫౭ విష)

అలుగు+క-అలుక (కోపము-భావా). అఁక (అఁగు+క నిరోధము-భావా). ఎఱుక (ఎఱుఁగు+క-ఎఱుఁగుట-భావా; ఇట బిందులోపంబు - ఇట్లు గొన్నిట నెఱుంగునది). దీనికి 'జ్ఞానము-సోదె-జ్యోతిశ్శాస్త్రము' అనునవి యర్థములగునపుడది కరణార్థకము (సాధన మగునని యర్థము). కడఁక (కడఁగు+క-పూనిక-భావా). కలఁక (కలఁగు+క-సంక్షోభము-భావా). కాఁక (కాఁగు+క-తాపము-భావా.) తునుక (తునుఁగు+క-ఖండము-ముక్క-కర్త్రి). నడక

(నడచు + క గమనము-భావా) సలుక (సలుగు + క-నలుగుట-భావా) పోక (పోవు + క-పోవుట-భావా). మడఁక (మడఁగు + క-ధౌతవస్త్రము-కర్త్రి). మలఁక (మలఁగు + క-మెలిక-భావా). మునుక (మునుఁగు + క-మునుఁగుట-భావా). మూక (మూఁగు + క-సంఘము-కర్త్రి) మొలక (మొలచు + క-అంకురము-కర్త్రి). రాక (వచ్చు + క. వచ్చునకు 'రా'-ఆగమనము-భావా). వంక (వంగు + క-వంకర-కర్త్రి) వీఁక (వీఁగు + క-విఱ్ఱవీఁగుట-ఓపుట-భావా). కానుక (కను + క-'ఇక-క-వు' అనునవి పరంబు లగునపుడు 'కను' నకు దీర్ఘంబు-ఉపాయనము-కర్మా). కినుక (కినియు + క కోపము-భావా). ముదుక (ముదియు + క-వృద్ధు-కర్త్రి)-ఇత్యాదు లలుగ్వాదులు.

## 'ఇమి-తజ్' అను కృత్తులు

'ఇమి' వర్ణకంబు కలుగ్వాదుల కగు ౪ (బా-కృ-౪; వ్యా-సం-౩౫౮ విష)

కలిమి (కలుగు + ఇమి-కల్గుట-భావా. 'సంపద' అర్థమగుచో నధికరణార్థకము) ఓరిమి (ఓరుచు + ఇమి-భావా) కూరిమి (కూరుచు + ఇమి-కరణా-దీనిచేతఁ బ్రీతిని గూర్తురు). నేరిమి (నేరుచు + ఇమి-భావా) వేలిమి (వేలుచు + ఇమి-భావా-హోమము 'వేల్చుచు' అను దానికి 'హోమముచేయు' అను నర్థము లేదు). బడిమి (బడియు + ఇమి-సిగ్గుదుడుచుట-భావా) బ్రదిమి (బ్రదుకు + ఇమి-జీవనము-భావా). ఒడ్డిమి (ఒడ్డు + ఇమి-పందెమున నొడ్డఁబడిన ధనాదికము-కర్మా). తాలిమి (తాలు + ఇమి-ఓర్మి-'తాలు' ధాతుజ మన్నయెడల భావార్థకము 'తాల్చు' ధాతుజమన్న పక్షమున నధికరణార్థకము. దీనియందు ధైర్యము తాల్తురు) ఇత్యాదులు.

'తజ్' వర్ణకము చేయ్యాదుల కగు ౫ (బా-కృ-౫; వ్యా-సం-౩౫౯ విష).

చేఁత (చేయు + త-చేయుట-భావా. 'కృత్యము-పని' అర్థమగునపుడు-కర్మార్థకము-చేయఁబడునది). జీతము గాన బిందుపూర్వకము చూ-తత్స-౧౯౯ వసూ). 'డాయు-దాయు-కలయు'మున్నగువానికి రానేరదు కాన సిది భావార్థక 'ట'

ప్రత్యయము (క్రియా-విశేషణము)వంటివి గాను. అలఁత (అలయు + త-అలయుట-భావా). కూఁత (కూయు + త-భావా). 'మొత్తు' అను నర్థమునఁ గర్మార్థకము. కూయఁబడునది) కోఁత (కోయు + త-భావా). గీఁత (గీయుట-భావా). నేఁత (నేయు + త-భావా) పూఁత (పూయు + త-చందనాదిచర్చ-కర్మా-పూయఁబడునది) పోఁత (పోయు + త-భావా). మూఁత (మూయు + త-మూకుడులో నగునది-కర్త) మేఁత (మేయు + త-మేయుట-భావా). పశ్వాదుల యాహార మర్థమగునపుడు-కర్మార్థకము) మ్రోఁత (మ్రోయు + త; ధ్వని-భావా). రోఁత (రోయు + త-జుగుప్స-భావా. రోఁతలు-తిట్లు-కర్మా). లాఁత (లాయు + త, ఉద్రేకించుట-భావా). వ్రాఁత (వ్రాయు + త-వ్రాయుట-భావా). 'లేఖనము' కర్మా-వ్రాయఁబడునది). వ్రేఁత (వ్రేయు + త-వ్రేయుట-భావా. వ్రేఁత-దెబ్బ కర్మా వేయఁబడునది). ఈఁత (ఈఁదు + త, 'దు'లోపము; నీటిపైఁ దేలుట-భావా). మడఁత (మడఁగు + త, ధౌతవస్త్రము-కర్త్రి). కలఁత (కలఁగు + త సంక్షోభము-భావా) ఇత్యాదులు.

## 'కువ-టు' ప్రత్యయములు

'కువ' వర్ణకం బడంగ్వాపుల కగు ఁ (బా-కృ-ఁ).

అడఁకువ (అడఁగు + కువ-భావా; రూ-అడఁకువ. ఆచ్చి-ఖంవ సూ). ఎఱుకువ (ఎఱుఁగు + కువ-తెలివి. కరణా. దీనిచేతఁ దెలియఁబడును; ఇది నిర్వాచక శబ్దము) కలఁకువ (కలఁగు + కువ-సంక్షోభము. భావా). నలఁకువ (నలఁగు + కువ-ఆపద-వ్యాధి-భావా; నలఁకువ-శ్రమ-కరణా. దీనిచేత శ్రమ గల్గును). పెనఁకువ (పెనఁగు + కువ; పెనఁగుట-భావా-పెనఁకువ-యుద్ధము. అధికరణార్థకము. దీనియందుఁ బెనఁగులాడుదురు). పొలకువ (పొలయు + కువ-జాడ. భావా; పొలకువ-మార్గము-అధికర-దీనియందుఁ బొలయుదురు-సంచరింతురు). మఱకువ (మఱచు + కువ; అజ్ఞానము-కరణా. దీనిచే మఱపు గల్గును). మెలఁకువ (మెలఁగు + కువ-జాగరూకతతోడి వర్తనము-భావా; మెలఁకువ-మేల్కొనుట-అధికర. దీనియందు మెలఁగుదురు). లోఁకువ (లోఁగు + కువ-లొంగుబాటు-భావా). వేకువ (వేగు + కువ-ప్రాతఃకాలము-అధికర; దీనియందు వేగును-తెల్లవాఱును) ఇత్యాదులు.

'ట' వర్ణకం బాద్యాదులు కగు నగుచో నంత లోపంబగు ౬ (బా-కృత్-౭ సూ; వ్యా-సం-౩౬౧ విష).

ఆట (ఆడు...ట-భావా). ఊట (ఊఱు + ట-కర్త; ఊఱిన ద్రవము). ఊఱట (ఊఱడు + ట; ఊరడిల్లుట-భావా; ఊఱట-సహాయము-కర్త). ఏఁకట (ఏకరు + ట, అపేక్ష-భావా). ఓట (ఓడు + ట. భావా-రూపా-ఓటము-ఓటమి) తివుట(తిరువు + ట-కాంక్ష-భావా). తేట(తేఱు + ట-మీఁదికిఁ దేఱునది-కర్త). త్రిమ్మట (త్రిమ్మరు + ట-పర్యటనము-భావా). పంట (పండు + ట; భావా) పాట (పాడు + ట; గానము-కర్మా-పాడఁబడునది). మంట (మండు + ట-జ్వాల-కర్త). వంట (వండు + ట-భావా) వేసట (వేసరు + ట; విసుగు-భావా) అనుప్రయుక్తమగు 'ఆట' శబ్దము ప్రాయికముగాఁ గ్రీడనమంబు-కోలాటము-పోరాటము; 'పోరాట' అనియుఁ గలదు "నిది పోరాటం దోటమి పాటు" (భాగ-గజేంద్రో). మున్ద్రాటము (సంతాపము) 'కొనియాట' అనియే యున్నది-ఇత్యాదులు.

## 'టు-వ' ప్రత్యయములు

'టు' వర్ణకంబు పద్యాదుల కగు. నగుచో నవి యాద్యక్షర శేషంబులయి దీర్ఘంబు నొందు ౮ (బా-కృత్-౮, వ్యా-సం-౩౬౨ వి)

పాటు (పడు + టు-పడుట-భావా పాటు-ఆపద-అధికర. దీనియందు శ్రమపడుదురు). చేటు (చెడు + టు; చెడుట-భావా; చేటు-ఆపద-అధికర-దీనియందుఁ జెడుదురు) ఆటు (అడుచు + టు-హతి-దెబ్బ-భావా) కాటు (కఱచు + టు; భావా; 'కఱచు-అభ్యసించు' అనుదానికీ ప్రత్యయము రాదు. అది 'కఱపు' అగును). పోటు (పొడుచు + టు-భావా). వాటు (వయిచు + టు-వైచుట-భావా) ఏటు (ఏయు + టు-బాణాదులను బ్రయోగించు-భావా). ఓటు (ఓడు + టు, భావా) వ్రేటు (వ్రేయు + టు-కొట్టు-భావా; రూపా-వేటు) ఇత్యాదులు

'వ' వర్ణకంబు తివియ్యాదుల కగు ౯ (బా-కృత్-౯ వ్యా-సం-౩౬౩ విష)

తిరిపము (తిరియు + ప-భిక్షము-భావా; ఈ 'ప' వర్ణ కాంతములు ప్రాయికముగా నపుంసక లింగ సమములు) తిరిపఁడు (భిక్షించువాఁడు-కర్తృ-రూపాం-తిరిపకాఁడు-తిరిపరి). కలియు-కలయు + ప-కలపము (లేపన ద్రవ్య విశేషము-కర్మా-పరిమళ ద్రవ్యములతోఁ గలపఁబడినది-లేదా-అధికరణార్థకము-పరిమళ ద్రవ్యములు దీనియందుఁ గలియును). పొలపము (పొలయు + ప-వ్యాపనము-భావా) మురిపము (మురియు + ప-నడకయందలి కులుకు-భావా; రూపాం-మురిపెము). వలిపము(వలియు + ప-సన్నగిల్లునది-కర్తృ)ఇత్యాదులు.

## 'త-పు' వర్ణకములు

'త' వర్ణకం బావులింపు లోనగువాని కగు ౧౦ (బా-కృత్-౧౦; వ్యా-సం-౩౬౪ విష).

అవులింత (అవులించు + త) ఇవెల్ల భావార్థకములె. అంగలాదులలోనివి గాన వీనికి స్వార్థమునం దించు క్రాగు (క్రియా-౨౫ సూ). వీనికి 'త' వర్ణక పరకత్వమునఁ దుది 'చు' వర్ణము లోపించును. ఇగిలింత (ఇగిలించు + త). ఓకిలింత (ఓకిలించు + త). కుళ్ళగింత (కుళ్ళగించు + త). కుసిలింత (కుసిలించు + త-అతృప్తిచే ఖేదపడు). కొక్కిరింత (కొక్కిరించు + త-పరిహసించుట). కొప్పరింత (కొప్పరించు + త-విజృంభణము). గిలిగింత (గిలిగించు + త-చక్కిలిగింత-కితకితలు పెట్టుట) ఇత్యాదులు.

'పు' వర్ణకంబు మాయ్యాదుల కగు ౧౧ (బా-కృత్-౧౧ ; వ్యా-సం-౩౬౫ విష).

మాపు (మాయు + పు-భావా; మాపు - రాత్రి - అధికర - దీనియందుఁ గన్నులు మాసిపోవును). మేపు (మేయు + పు-మేఁత-భావా; మేపు-పశ్వాద్యాహారము. కర్మార్థకము మేయఁబడునది) అడుపు (అడుచు + పు-దెబ్బ-భావా; అణుపు-రూపాం-అచ్చి-౪౦ చూ) ఇంపు (ఇంచు + పు; భావా). ఏఁపు (ఏఁచు + పు-వేఁచుట భావా; ఏచు + పు-వృద్ధి-భావా) కాఁపు (కను + పు, చూకృత్తు-౩౫ సూ-ప్రసూత-వీక్షణము-భావా) కాపు (కాచు + పు; కాయలు కాచుట-

రక్షించుట-భావా; కాపు-రక్షకుఁడు-కర్త్రి). చూపు (చూచు + పు-వీక్షణము. భావా). తలఁపు (తలఁచు + పు-తలఁచుట-భావా; తలఁపు-వాంఛ-ఇచ్ఛ-కర్మా-తలఁపఁబడునది). తోఁపు (తోఁచు + పు-తలంచుట-భావా) త్రేఁపు (త్రేఁచు + పు-ఉద్గారము-భావా). త్రోపు (త్రోఁచు + పు-త్రోయుట-భావా). పూఁపు (పూఁచు + పు-బండికెడ్లనుఁ బూఁచిన పూఁపు-భావా). పెనుపు (పెనుచు + పు-పెంచుట-భావా) పొలుపు (పొలుచు + పు-ఒప్పిదము-భావా). ప్రోపు (ప్రోఁచు + పు-రక్షణము-భావా). మెప్పు (మెచ్చు + పు-శ్లాఘ-భావా). మోపు (మోచు + పు-గడ్డి లోనగువాని కట్టు-భావా. లేదా-కర్మా-మోయఁబడునది) వలపు (వలచు + పు-కోరిక-వాసన-కర్మా-వలవఁ బడునది) వాపు (వాచు + పు-ఉబ్బు-భావా). వేలుపు (వేలుచు + పు-వేల్వఁబడునది-కర్మా)-ఇత్యాదులు.

## పు-ఇంపు-ఇక వర్ణకములు

"రక్షింపు (రక్షించు + పు-రక్షణము-భావా)" అను రీతిని తత్సమ ధాతువులపైని 'పు' వర్ణకము నిలుచు (రక్షించుట మొదలగు వానివలె) వాడుక కలదు. ఇట్లె బోధింపు-పోషింపు-మేళగింపు మొ. "క్వచి దింపున్నతాం కేచి దూచిరే నహి మే రుచిః" అని యథర్వణుఁ డనెను (వ్యా-సం-౩౧౯-౩౧౯ I విష). 'ఆరగింపు' (పర-౪ ఆ-౧౯౯; చూ-క్రి-సూ-౪౬ సూ ౬ వివ)

'ఇక' వర్ణకం బంజ్వాదుల కగు ౧౨ (బా-కృత్-౧౨ సూ; వ్యా-సం-౩౬౬ విష).

అంజిక (అంజు + ఇక-భయము-భావా) అమరిక (అమరు + ఇక-ఒప్పిదము-భావా) అరయిక (అరయు + ఇక-అరయుట-భావా. అలయిక (అలయు + ఇక-అలయుట-భావా). అడిక (అడు + ఇక-వండు-భావా). ఓడిక (ఓడు + ఇక-ప్రవహించునది-కర్త్రి). ఓపిక (ఓపు + ఇక - ఓపుట-భావా) కానిక (కను + ఇక-దీర్ఘము-చూ-ఆన్ధ్ర-కృత్తు-౩౭సూ-ఉపాయనము-కర్మా-గౌరవముగాఁ జూపఁబడునది). కూడిక (కూడు + ఇక-కూడుట-భావా) కోరిక (కోరు + ఇక-వాంఛితము-కర్మా, కోరఁబడునది) పొందిక (పొందు + ఇక-ఒప్పిదము-భావా). పోలిక (పోలు + ఇక-పోలుట-భావా) తూనిక

(తూఁగు + ఇక; తూఁగునకు-తూగ్వాదేశము-తూఁచు - అధికర - దీనియందు సరిగఁ దూఁగును-ఇత్యాదులు.

## నవర్ణకోదాహృతులు

'వీచు' ప్రభృతులకు 'నజీ'యగు ౧౩ (బా-కృత్-౧౩; వ్యా-సం-౩౬౭ విష).

వీవన (వీచు + నజీ నజీ జిత్తుగాన క్రియా-౨౮౮వ సూ. చొప్పున 'ఉ' కారమునకు 'అ'త్వమును, క్రియా-౯౦-౯౧వ సూ. చొప్పున చకారమునకు 'వ'త్వము నగును; వ్యజనము-కర్త్రి-విసరునది-విసనకఱ్ఱ). దట్టన (దట్టించు + నజీ; తర్జనము-దట్టించుట-భావా)* ఇత్యాదులు

౧వ వివ: 'దట్టించు' లోనగు వానికి 'నజీ' పరమగునపుడు 'దట్టన'-దట్టనము' మున్నగు రూపము లేర్పడును. ఉదా: దట్టించు + నజీ-దట్టన. దీవించు + నజీ-దీవన (రూపా-దీవెన-భావా). పాటించు + నజీ-పాటన (ఆదరణము-భావా)-ఇత్యాదులు.

## 'బడి-గడ' వర్ణకములు

'బడి' యేల్వాదుల కగు ౧౪ (బా-కృత్-౧౪. వ్యా-సం-౩౬౮ విష).

ఏలుబడి (ఏలు + బడి-భావా). కట్టుబడి (కట్టు + బడి-పన్ను-కర్మా-

---

* సూరి ''అప్పాదులకు 'నజీ' యగు'' (బా-కృత్-౧౩) అని సూత్రించుట సరికాదు. అవి కృదంతము లనరాదు. అవి 'అర్పణ' మున్నగు ప్రకృతుల వైకృతము లనుట యుక్తము. సంస్కృ-అర్పణమ్; వైకృ అప్పన-అప్పనము (రూపాం-ఒప్పన-ఒప్పనము) సంస్కృ-ఉజ్ఝనమ్; వైకృ. ఉజ్జన-ఉజ్జనము (విడుచుట). సంస్కృ ఘట్టనా-ఘట్టనమ్; వైకృ. గట్టన-గట్టనము. సంస్కృ-గణనా-లేదా-ఘటనా-ఘటనమ్, వైకృ గడన-గడనము. సంస్కృ-మాననా-మాననమ్; వైకృ. మన్నన-మన్ననము మొ.

కట్టఁబడునది). కనుబడి (కను + బడి-రాజులు తీసికొను పన్ను-కర్మార్థకము-రాజులచేఁ గనఁబడునది). కొనుబడి (కొను + బడి-భావా). గిట్టుబడి (గిట్టు + బడి-కొనుటలోని గిట్టుపాటు-భావా). చెల్లుబడి (చెల్లు + బడి-మాట చెల్లుట-భావా). చేరుబడి (చేరు + బడి-సమీపము-కర్త్రి-సమీపించునది). తగులుబడి (తగులు + బడి-కొనుబడి మున్నగువానిలోని తగులుపాటు-భావా). తీఱుబడి (తీఱు + బడి-అవకాశము-భావా). పెట్టుబడి (పెట్టు + బడి-వ్యాపారమున ముందుగఁ బెట్టు ధనాదికము-కర్మా. పెట్టఁబడునది). పోబడి (పోవు + బడి-వులోపము-పోవుట-భావా). మ్రొక్కుబడి (మ్రొక్కు + బడి-దేవతావిశేషమునకు మ్రొక్కుకొనుట-అధికరణా. దీనియందు ధనాదికముతో మ్రొక్కుదురు). వచ్చుబడి (వచ్చు + బడి-ఇతరుల నుండి వచ్చునది-కర్త్రి; రూపాం-రాబడి). సాగుబడి (సాగు + బడి-కృషి-అధికర-దీనియందు సాగ-యత్నము చేయుదురు). ఇత్యాదులు.

'గడ' చేర్వాదుల కగు ౧౫ (బా-కృత్-౧౫; వ్యా-సం-౩౭౯ వి)

చేరుగడ (చేరు + గడ-సమీపము-కర్త్రి, సమీపించునది-చేరుగడ-శరణము-కర్మార్థ-ఆర్తులచేఁ బొందఁబడునది) తిరుగడ (తిరుగు + గడ-గులోపము-మఱచేతఁ దిరుగునది-కర్త్రి). తీఱుగడ (తీఱు + గడ-తీఱిక-భావా). తేఱుగడ (తేఱు + గడ-తేటపడుట-భావా). త్రేగడ (త్రేఁచు + గడ-చులోపము; బిందులోపము-ఉద్గారము-భావా) మనుగడ (మను + గడ-మనుట-భావా). మనుగడ-జీవనోపాయము-కరణార్థకము. దీనిచేత జీవింతురు) విడుగడ (వీడుగడ-విడు + గడ-విడుపు-భావా) ఇత్యాదులు.

## 'ఇకి-వు-అ' అను ప్రత్యయములు

'ఇకి' కోర్వాదుల కగు ౧౬ (బా-కృ-౧౫; వ్యా-సం-౩౮౦ విష)

కోరిక (కోరు + ఇకి-ఇచ్ఛ-భావా) పూనిక (పూను + ఇకి-పూనిక-భావా). పోలిక (పోలు + ఇకి-పోలిక-భావా). మనికి (మను + ఇకి-జీవించుట-భావా. మనికి-నివాసస్థానము-అధికర-దీనియందు మనుదురు). వినికి (విను +

ఇకి-వినుట-భావా). చూచికి (చూచు + ఇకి-చూచునకు ముత్పరకత్వమందువలె 'చూడు' ఆదేశము-చూపు-భావా) ఇత్యాదులు.

'వు' వర్ణకంబు మన్వాదుల కగు ౧౫ (బా-కృత్ ౧౭. వ్యా-సం-౩౭౧).

మనువు (మను + వు-జీవనము-భావా). కావు (కాచు + వు-రక్షణము చేయు, టొట్టు-కర్త్రి, దృష్ట్యాదిదోషములను గాచునది). కొలువు (కొలుచు + వు-సేవ-భావా). చావు (చచ్చు + వు-వర్ణలోపాది వికృతి-మరణము-భావా). తడవు (తడయు + వు-ఆలస్యము-భావా). నిలువు (నిలుచు + వు - నిల్చుట-భావా). నోవు (నొచ్చు + వు, రూ. నొవ్వు; నొచ్చునకు 'నో' వచ్చును-నొప్పి-భావా). పూవు (పూచు + వు రూపా-పువ్వు- పుష్పము-కర్మార్థ - పూయఁబడునది; ప్రువ్వు ప్రుచ్చు + వు-'చ' ద్వయమునకు 'వ' ద్వయము-పురుగు-పురువు. కరణా-దీనిచేతఁ బ్రుచ్చును). పుట్టువు (పుట్టు + వు-జన్మము-భావా). తొడరువు (తొడరు + వు-యత్నము-భావా) ఇత్యాదులు

'అ' వర్ణకంబు గీఱ్ఱా (ర్వా) దుల కగు ౧౮ (బా-కృత్-౧౮; వ్యా-సం-౩౭౨ విష. స్పష్టార్థము ఱ్ఱా).

గీఱ (గీఱు + అ-గీఁత-భావా). ఊఁద (ఊఁదు + అ-ఉబ్బు-భావా). ఎండ (ఎండు + అ - సూర్యాతపము కర్త్రి - అంతర్గత ప్రేరణార్థకము-ఎండించునది)కాయ(కాయు + అ- ఫలాటువు-కర్మార్థ. చెట్టుచేఁ గాయఁబడునది). చదియ(చదియు + అ-నలఁగుడు- భావా). తునియ (తునియు + అ-ఖండము-కర్త్రి-తునిసినది) పరియ (పరియు + అ-బీఁట-భావా). పాయ (పాయు + అ-నది బీలిక-కర్త్రి- ఒక వస్తువునుండి పాయునది) పిడుచ (పిడుచు + అ-అన్నము లోనగువానిముద్ద-కర్మార్థ-పిడుచఁబడునది). మీట(మీటు + అ-ఏతము మున్నగువాని కీలు-కర్త్రి-మీటునది) ముడియ (ముడియు + అ-మూట-కర్మార్థ-ముడియఁబడునది) వదర (వదరు + అ- ప్రేలరి-కర్త్రిర్థ-వదరు వాఁడు). వ్రయ్య (వ్రయ్యు + అ-ఖండము-కర్త్రి-వ్రయ్యునది) ఇత్యాదులు.

# 'అక-డు' ప్రత్యయములు

'అక' వర్ణకంబు మాఱ్ఱా (ర్వా) దులకగు ౧౫ (బా-కౌ-౧౫ వ్యా-సం-౩౭౩-విష).

మాఱకము (మాఱు + అక మార్పు-భావా). 'అక' ప్రత్యయాంతము లెల్ల నపుంసక సమములు అమ్మకము (అమ్ము + అక-అమ్ముట-భావా). అంపకము (అంపు + అక-ప్రేషణము-ప్రేరణా-భావా చూ-క్రియా-౧౦ వ సూ). పంపకము (పంచు + అక-చకారమునకు 'ప' త్వము; విభాగము-భావా. పంపు + అక-క్రియా-౧౦ వ సూ-పంపకము-ప్రేషణము-భావా). వంటకము (వండు + అక. 'డ' కారమునకు 'ట' కా రాదేశము-అన్నాదికము-కర్మార్థ-వండఁబడునది). త్రోమకము (త్రోము + అక-త్రోముట-భావా; 'త్రోము' అను రేఫమున కాధార మగపడదు. శ-ర-లో 'తోమక' మనియే యున్నది). అద్దకము (అద్దు + అక-వస్త్రములకు వేయు రంగు-కర్మార్థ-అద్దఁబడునది).

'డు' వర్ణకం బాఱ్ఱా (ర్వా) దుఁకగు, నగునపుడు పకారంబు 'చ-య' లకగు ౨౦ (బా-కౌ-౨౦. వ్యా-సం-౩౭౪ విష).

ఆఱుడు (అఱు + డు-నిర్ద్రవమగుట-భావా). అమ్ముడు(అమ్ము + డు-అమ్మకము-భావా) అల్లుడు (అల్లు + డు-అల్లిక-భావా ; ఇది నిర్బంధుకము-జామాత్రర్థకము కాదు. ప్రాఁకు-అధికర-అతానేకము దీనియం దల్లుకొనును). ఎక్కుడు (ఎక్కు + డు-ఎక్కుట-భావా. ఎక్కుడు-వాహనము-అధికర-దీనియం దెక్కు దురు). క్రుమ్ముడు (క్రుమ్ము + డు- కుమ్ముట-భావా) చోపుడు (చోపు + డు-కఁలత-భావా;చోపు-కలఁచు-తరుము-మొ) త్రొక్కుడు(త్రొక్కు + డు-ఆపద-భావా) త్రోపుడు( త్రోచు + డు-త్రోపు-భావా) దంపుడు(దంచు + డు-దంపుట భావా). దాఁపుడు (దాఁచు + డ -దాఁచుట-భావా) దిగుడు (దిగు + డు-పల్లము-కర్త్రి-దిగునది). దోఁపుడు (దోఁచు + డు-కొల్ల-భావా) పెంపుడు (పెంచు + డు-కర్మార్థ-పెంపఁబడునది). ప్రేఁపుడు ( ప్రేఁచు + డు-భావా. అధికుఁడని యర్థము). ప్రాఁకుడు (ప్రాఁకు + డు-ప్రాఁకుట-భావా). మాపుడు

(మాయు + డు-ముటికి-భావా). రాపుఁడు (రాచు + డు-రాచుట-భావా)-ఇత్యాదులు.

## 'ఉ' ప్రత్యయము

'ఉ' వర్ణకం బడుక్వాదుల కగు ౨౧ (బా-కృ-౨౧: వ్యా-సం-౩౭౫ విష.)

అడుకు (అడుకు + ఉ-దొంతి-కర్మా-దొంతిగ నిల్పబడినది. అడుకులు-చిపిటములు, అటుకులు వ్యావహా. నిత్యబహువచనము-దీని కీధాతువుతో సంబంధ మగపడదు). అంటు (అంటు + ఉ-అశౌచము-అపాదానా-అంటుట వల్లఁ గల్గునవి-అంట్లు-బహు-వండిన పాత్రలు-కర్త్రి-మసి యంటునవి). ఒప్పు (ఒప్పు + ఉ-ఒప్పిదము - భావా). ఒఱుగు (ఒఱుగు + ఉ - ఒఱుగుట-భావా-'ఒఱగు' అనియు నన వచ్చును. నిర్ణాయక ప్రయోగము లేదు) ఒసఁగు(ఒసఁగు + ఉ-ఈవి-కర్మా-ఒసఁగఁబడునది.) ఇత్యాదులు. ఆది శబ్దముచే "చదువు (చదువు + ఉ-విద్య). అడలు (అడలు + ఉ-దుఃఖము) పలుకు (పలుకు + ఉ -మాట). ఒడ్డు (ఒడ్డు + ఉ-పందెము). కలపు (కలపు + ఉ-కలచు-పేర. కలపు-బోధనము). ఎలుకు (ఎలుఁగు + ఉ. గకారము కకార మగును-సోదె చెప్పువాఁడు). పుట్టు (పుట్టు + ఉ-జన్మము). హెచ్చు(హెచ్చు + ఉ-అధిక్యము). ఉబ్బు(ఉబ్బు + ఉ-ఉబ్బిపోవుట). చెప్పు (చెప్పు + ఉ-చెప్పినమాట). కుడుపు 'దీని 'చ'కారము 'ప'కార మగును; కుడుచు + ఉ-కూడు-అన్నము)"-మొదలగు వానిని గ్రహింపనగును.

## 'వడి' ప్రభృతులు - 'ఇ' ప్రత్యయము

'వడి' ప్రభృతులు నిల్లెఱుంగునది ౨౨; (బా-కృత్-౨౨; వ్యా-సం-౩౭౭ విష)

వడి : కొలువడి (కొలుచు + వడి-కొలఁత-భావా). గెలువడి (గెలుచు + వడి-గెలుపు-భావా). నడవడి (నడుచు + వడి-ప్రవర్తనము-భావా). లేవడి (కలుగు వ్యతిరేకము-లే + వడి-చూ. క్రియా-౧౧౦వ సూ. దీని పర్యాయము-లేమి-క్రియా. ౧౧౦. లేమి + ఇడి-లేమిడి-ఇది తద్ధితాంతము).

వి : విరివి (విరియు + వి-విస్తృతి-భావా) తెలివి (తెలియు + వి-వివేకము-కరణా-దీనిచే నెల్లయుఁ దెలియును) అవు: తగవు (తగు + అవు-బహుమతి-కర్త్రి-తగియుండునది. తగవు - అభియోగము - అధికర - దీనియందు న్యాయము తేలును). నగవు (నగు + అవు-నవ్వుట-భావా). ఇ : వ్రాయి (వ్రాయు + ఇ-అక్షరము-కర్మార్థ-వ్రాయఁబడునది). చేయి (చేయు + ఇ-కర్త్రి -పనులుచేయునది) కలి : కనుకలి (కను + కలి-చూపు-భావా). వినుకలి (విను + కలి-వినికి-భావా)- ఇత్యాదులు.

దయ్యు-దయ్యు-నొచ్చు-పుచ్చులకు 'ఇ' వర్ణకంబగు, నగుచో వాని కడ హల్లు 'ప'కారంబగు ౨౩ ( పౌఢ-కృత్-౧ ; వ్యా-సం-౩౭౮ విష.)

దప్పి (దయ్యు + ఇ-దప్పి-భావా) దప్పి(దయ్యు + ఇ-దప్పి.-భావా). నొప్పి (నొచ్చు + ఇ-బాధ-భావా). పుప్పి పుచ్చు + ఇ-భావా).

## 'ఇడి-ఎన-పుర' ప్రత్యయములు

రాచున 'కిడి' వర్ణకంబగు ౨౪ (పౌఢ-కృత్-౨వ సూ).

రాయిడి (కృత్తు ౨వ సూ-'చు' లోపము. రాచు + ఇడి-ఉపద్రవము-భావా. రాచు ధాతువునకు కృత్తు ౧౧వ సూ. చొప్పున 'పు' రాఁగా 'రాపు' అగును. కృత్తు-౨౦వ సూ-చొప్పున 'డు' రాఁగా 'రాపుడు' అగును. 'రాచు' చకారము పకారమగును. చూ-కృత్తు-౨౦వ సూ 'రాచు' నకు 'ఇడి' ప్రత్యయము చేరఁగా 'రాపిడి' అగును. ఇందును 'చ' కారము 'ప' కార మగును).

ఈర్చుబ్బు కందు దువ్వు వడ్డించుల కెన వర్ణకం బగు; అగుచో 'ఈర్చు-ఉబ్బు'ల 'చ' కార 'బ' కారములు 'ప'కార మగును. 'వడ్డించు' అను దాని 'ఇంచు' లుప్తంబగు ౨౫ ( పౌఢ-కృత్తు-౩వ సూ; వ్యా-సం-౩౫౮ విష)

ఈర్పెన (ఈర్చు + ఎన-ఈళ్ళు దువ్వెన-కర్త్రి-ఈరుల నీర్చునది). ఉప్పెన (ఉబ్బు + ఎన-చూ-కృత్-౨౧వ సూ-సముద్రాదుల పొంగు-అధికర-

దీనియందు సముద్రాదు లుబ్బును) కందెన (కందు + ఎన-మసి-కరణా-దీనిచే బండి యిరుసు నల్లనగును). దువ్వెన (దువ్వు + ఎన-కంకతిక-కేశప్రసాధని-పన్ని. కర్త్రి-తల చిక్కును దువ్వునది) వడ్డెన (వడ్డించు + ఎన-భోజ్య పదార్థములను భోజన పాత్రములందుఁ బెట్టుట-భావా).

'పుర' వర్ణకంబు కాచు-దాఁచు-దాయ్యాదుల కగు ౨౬ (ప్రౌఢ-కృత్-౪౨ సూ; వ్యా-సం-౩౭౬ విష)

కాఁపురము (కాఁచు + పురము-సంసారము-కర్త్రి-కాఁగఁ జేయునది. సంసారము జనులను గాఁగజేయు నని భావము). కఁగు- పే. కాచు; కాఁగు-ప్రే-కాఁచు. ఇట్లగుటచేత దీనికి "కాచు = రక్షించు" అనునది మూలము కాదు. దాఁపురము (దాఁచు + పురము-దాఁచుట-భావా). దాపురము(దాయు + పురము-సమీపము-కర్త్రి-సమీపించునది).

## 'మతి-వు-వలి-ఇలి-వ-దల-కడ' ప్రత్యయములు

ఎక్కు-దిగులకుం బేరణార్థంబున "మతి" వర్ణకంబగు. అగుచో 'ఎగు' అనునది "ఎక్కు"న కాదేశం బగు ౨౭ (ప్రౌఢ-కృత్-౫౫ సూ, వ్యా-సం-౩౭౬ వి) ఎగుమతికి (ఎక్కు + మతి-భావా). దిగుమతి (దిగు + మతి-భావా. చూ-కృత్-౩౧).

'వు' వర్ణకం బులియ్యాదుల కగు ౨౮ (ప్రౌఢ-కృత్-౬వ సూ; వ్యా-సం-౩౭౬ విష) ఉలివు (ఉలియు + వు-ధ్వని-భావా) ము.

'కాచు-వీచు' లకు 'వలి' వర్ణకంబగు ౨౯ (ప్రౌఢ-కృత్-౭; వ్యా-సం-౩౭౬ విష)

కావలి (కాచు + వలి-రక్షణము-భావా). వీవలి (వీచు + వలి-గాలి-కర్త్రి-వీచునది)

'ఒదుగు' ప్రభృతులకు 'ఇలి' యగు ౩౦ (గాణ; వ్యా-సం-౩౮౬).

ఒదిగిలి (ఒదుగు + ఇలి). పొక్కిలి (పొక్కు + ఇలి). చెక్కిలి (చెక్కు + ఇలి)

'వ' వర్ణకంబు తెల్గ్వాదులకగు ౩౧ (గౌణ). తెరువ (తెరు + వ-సాహసము) ఎరువ (ఎక్కు + వ-ఎక్కునకు ఎగు-చూ-కృ-౨౯౬ సూ)

అరుగ్వాదులకు 'దల' యగు ౩౨ (గౌణ; వ్యా-సం-౩౭౬ విష). అరుగుదల (అరుగు + దల). విడుదల (విడు + దల) మొ.

'వచ్చు-పోవు-నిలుచు' లకు 'కడ' వర్ణకం బగు ౩౩ (గౌణ; వ్యా-సం-౩౭౬).

రాకడ (వచ్చు + కడ-వచ్చునకు-'రా'). పోకడ (పోవు + కడ-పోవు 'వు' లోపము). నిలుకడ (నిలుచు + కడ)
తెలియునకు 'విడి' యు, కొనునకు 'కోలు' నగు ౩౪

తెలివిడి (తెలియు + విడి) పొగడ్కోలు (పొగడు + కొను). విల్ల్కోలు (విల్చు + కొను).

ఇట్లే-ఉక్కివము (ఉక్కు + ఇవము-వాష్పరతము). అలుగలు (బాధ-అలుగు) పని (పన్ను + ఇ). మొదలగవాని నెఱుంగునది. కృత్తు లనంతములు వానిని సాకల్యముగా నుపవేశింప శక్యము కాదు.

ఇది అచ్ఛిక కృదంత పరిచ్ఛేదము
౦) —(౦

# బాలవ్యాకరణోద్యోతము

## సంస్కృత కృదంతము

౧వ విధి: సంస్కృత కృదంత పరిచ్ఛేదాదిని సంస్కృత కృత్తుల స్వభావము కొంత వివరింపబడును.

కృత్తులును, వాని యర్థములును సాధారణముగాఁ బ్రయోగ వేద్యములె.

శ్లో. కృతోయే యత్ర విహితా। స్తత్రమానం భవన్తితే కృద్ధోఃక భావ ఇత్యుక్తే రన్యత్రాపి పయోగతః" (ముగ్ధ ౯౬౫వ సూ. ధు-ధాతువు. క-కార ము. ముగ్ధబోధసంజ్ఞలు). "చెప్పఁబోయెడి ప్రత్యయము కృత్సంజ్ఞ గలది. అయ్యది ధాతువునకుఁ బరముగ నగును. అది కారకమందును భావార్థమందును నగును" అని పయిశ్లోకమునకు భావము ఇట్లు వోపదేవుఁడు "కృద్ధోఃక భావే" అను సూత్రముచే వచించి యున్నాఁడు. వోపదేవుఁడిట్లు కారకమం దనెనే కాని కృత్తుల కర్థ నిర్ణయము చేయలేదు. కృత్ప్రత్యయములను సాకల్యముగాఁ జెప్ప శక్యము గాదు.

శ్లో. కృత్తద్ధిత సమాసానా। మభిధానం నియామకమ్ లక్షణం త్వనభి జ్ఞానాం। తదభిజ్ఞాన సూచికమ్" (ముగ్ధ-౧౧౮౭వ సూ). పాణినీయులును నిట్లె చెప్పుదురు. "ఉణాదయో బహుళమ్"(౩-౩-౧; సి-కౌ-౩౧౬౯వ సూ). 'ఉణ్' మొదలగు కృత్ ప్రత్యయములు ధాతువునకుఁ బరముగ బహుళముగా నగును. ఈ దాహుళ్య మిట్లు వివరింపఁబడెను. "కేచి దవిహితా అప్యూహ్యాః-" "సంజ్ఞాసు ధాతు రూపాణి ప్రత్యయాశ్చ తతః పరే కార్యా ద్విద్యా దనూబన్ధ। మేతచ్ఛాస్త్ర ముణాదిషు" అని మహాభాష్యమున వ్రాయఁబడెను

౨వ విధ: కృత్తులు ధాతువులపైనె నిల్చును. కృదంతములు నామ ములె యగును.

## తవ్య-అనీయ-యప్రత్యయములు

'తవ్య-అనీయ-య' అను ప్రత్యయములు కర్మార్థము నందును (ముగ్ధ-'ధ') భావార్థమునందును ధాతువుపై నిల్చును (ముగ్ధ-౯౬౩వ సూ; సి-కౌ-౨౮౩౪-౨౮౪౨వ సూ).

ఈ తవ్యాది ప్రత్యయములను "కృత్య" ప్రత్యయము లనియుఁ బాణి నీయులు (ముగ్ధ-'ల్య' సంజ్ఞ) వాడుదురు. ఇవి సకర్మకములకుఁ గర్మార్థమం దును సకర్మ కాకర్మకములకు భావార్థమునందును నగును.

